శ్రీ

# ఆంధ్ర శబ్దతత్త్వము

## క్రియా ప్రకరణము.

ప్రెసిడెన్సీకాలేజిలో సంస్కృతమునకు ప్రొఫెసరుగా నుండిన

తాతనల్లి మిరాశిదార్

శ్రీ శేషగిరిశాస్త్రి, ఎమ్. ఏ. గారిచే

రచియింపఁబడినది.



వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్.

4. మల్లికేశ్వరస్వామి గుడిసందు,

లింగిసెట్టివీథి, జి. టి. మదరాసు.

1948



రు. 1—8—0

గ్రామము వదలి మదరాసునకు వచ్చేసి గీర్వాణభాషాసేవను మఱియుం తీవ్రముగ సలుపందొడంగిరి. ఓవింగని వీరితండ్రిగారు తమమాటల ఇష్టానుసారము వారికిందోడ్పడ మదరాసుం జేరిరి. కొంతకాలమునకు శ్రీ శాస్త్రులవారికి తమకు ఆంగ్లమునందుఁగూడ పాండిత్యమలవడుచో నది మఱియు మేలని తలంచి ఆంగ్లము నభ్యసింప మొదలిడిరి. త్వరలోనే మెట్రిక్యులేషన్ పరీక్షయందు ఉత్తీర్ణులైరి. ఈవిధముగా నొకవైపు ఆంగ్లమును, మఱియొకవైపు సంస్కృతాదిప్రాచ్యభాషలను చదువుచుండిరి. అప్పటినుండియు శాస్త్రులవారికి, మాతృభాషను జనులు ఆంగ్లభాషావాహినింబడి మఱచుచున్నారనియు, దానిని మాన్ప మాతృభాషావిషయమై తీవ్రప్రయత్నము వలసియున్నదనియు, అందులకు తాము పూనుకొనవలయుననియు గాఢముగ తలంపుండెను. వయసులో చిన్నవారైనను గొప్పవిషయములను పండితులతో చర్చించుచుండువారు.

మెట్రిక్యులేషన్ పరీక్షయయిన పిదప శ్రీ శాస్త్రులవారు, ప్రెసిడెన్సీ కాలేజిలో ఎఫ్. ఏ.; బి. ఏ. (౧౮౭౧) పరీక్షలయందు ఉత్తీర్ణులైరి. వారికి సంస్కృతమునందుఁగల పాండిత్యమును, డాక్టరు ఆపర్టుదొరవారు ఐదు నెలలు సెలవుపొందఁగానే, వారికిబదులుగా, ఆ స్థానమున సంస్కృతపండితులుగా వీరిని కళాశాలాధికారులు నియమించిరి. అప్పుడు వీరికి వయసు ౨౭ సం. లు. అచ్చట సంస్కృతోపధ్యాయులుగా నున్న యా యల్పకాలమునందే వీరు పైయధికారుల యభిమానమును సంపాదింపఁగల్గిరి. కళాశాలాధ్యక్షులు థామ్సన్ దొరవారు శాస్త్రులవారిని సంస్కృతప్రొఫెసరుగా నియమించి వేతనము హెచ్చింప పైయుద్యోగస్థులకు వ్రాసిరి గాని అది కొనసాగినది కాదు. శ్రీ శాస్త్రులవారు ౧౮౭౨ సం. నవంబరు ౧౮ తేది ఆపర్టు గారికి తమస్థానమును వదలివైచిరి.

కాలవిలంబము నోర్వక శ్రీ శాస్త్రులవారు వెంటనే ప్రాచ్యలిఖిత గ్రంథపరిశోధన మొదలిడిరి. ౧౮౭౨ సం. ను మొదలు తాటిగ్రంథములను సేకరించుచు ఆసంవత్సరమే అక్టోబరునెలలో విక్రయార్థమువచ్చిన కొన్ని

గ్రంథములపై సమర్థముగా నొక లేఖను గవర్నమెంటువారికి వ్రాసిరి. దానిం గని వారు శాస్త్రులవారి శ్లాఘించి తమప్రోత్సాహ మొసంగ మొదలిడిరి. శాస్త్రులవారు గ్రంథసముపార్జనముసేయ దీక్షవహించిరి.

శాస్త్రులవారు పైలాలజీవిషయముపై ఎప్పటినుండి పరిశ్రమ మొదలిడినది యెఱుంగ నశక్యము. వారు వ్రాసిన ఆర్యద్రవిడ పైలాలజీ గ్రంథమునందు వ్రాసిన యుపోద్ఘాతమును* బట్టి యాంగ్లేయ విద్యాభ్యాసముం డునప్పుడే వారికి పైలాలజీయం దభిరుచి కలిగియుండెనని తెల్లమై యున్నది.

౧౮౭౬ సం ఫిబ్రవరి నెలలో యమ్. ఏ., పరీక్ష సంపూర్ణమందును, అత్యున్నతమునను దేని శ్రీశాస్త్రులవారే ఈరాజధానిలో మొదటివారుగ కృత యమ్. ఏ. అలంకృత శాస్త్రులవారు సంస్కృతము, హిబ్రూ, ఫ్రెంచి, బంగాళీ, కొంత లాటిను, గ్రీకుభాషలను చదువ మొదలిడిరి. థాంసన్ దొరవారు కడపటి రెండుభాషలను చదువ శాస్త్రులవారికి పలయూ సహాయములనెల్ల గావించిరి.

౧౮౭౭ సం. ఫిబ్రవరిలో పాఠశాలలపై ఇన్‌స్పెక్టరుగా నియమింపఁబడిరి. ౧౮౭౯ సం॥ జూలై ప్రెసిడెన్సీకాలేజీలో ప్రాచ్యభాషాప్రవచనాధ్యక్షత్వపదము నొందిరి. ఈ యుద్యోగమునందు శాస్త్రులవారు పలుభాషల పైన వానివ్యాకరణములను గుఱించియు, వానిపైలాలజీని గుఱించియును ఉపన్యాసముల నిచ్చుచుండిరి. ఈవిధముగా నిరంతరపరిశ్రమచే శాస్త్రులవారు అత్యల్పకాలములోనే 'పైలాలజీ. ప్రథమ ప్రవర్తకు' లని ప్రసిద్ధిగాంచిరి.

---

*Having seen my taste for linguistic studies, my teacher Mr. Thompson, the late Principal of the Presidency College, recommended to me a comparative study ot the languages and I carried out the advice. This Comparative method gave a fresh impetus to my study of languages and made the otherwise uninteresting and barren investigations of words and grammatical forms and phrases very pleasant and fruitful.

మొందుచు గవర్నమెంటువారిచే శాస్త్రులవారు బహుమానములు బొందుచుండి యున్నారు. సంస్కృతభాషాపరీక్షకసభాధ్యక్షులుగా నుండిరేమి తమిళము, ఆంధ్రము, కన్నడము, మళయాళము, మొదలగువాని పరీక్షకసభలయందు సభ్యులుగా నుండిరి. గవర్నమెంటువారి పరీక్షలను పెక్కింటిని స్వయముగా విచారించి జరుపుచుండువారు.

శ్రీ శాస్త్రులవారి గ్రంథములనవలోకించియు, వారు కావించు నితరకార్యముల గుఱించియు, మాన్సియర్ విన్సను, పారిస్‌వారైన ఫొకాక్స్, డా. హార్నలి, గ్రియర్సన్, డా. బర్నెల్, కొలంబియావారైన జాక్సన్ మున్నగు దొరలు, ప్రాచ్యభాషాపండితులు మిక్కిలి ప్రశంసించియున్నారు.

శాస్త్రులవారు ౧౮౮౪. సం. 'Notes on Aryan and Dravidian philology' అను గ్రంథముయొక్క మొదటిభాగమును ప్రకటించిరి. ఈ గ్రంథమునందు వీరు తమ చిరపరిశీలనోపలబ్ధములైన విషయములను వ్రాసియున్నారు. అట్టిపరిశ్రమను అంతతీవ్రముగ సాగించి దానిని స్వరూపమునకుం దెచ్చినవారిలో శ్రీ శాస్త్రులవారే ప్రథములు. శాస్త్రులవారు తమ పరిశ్రమయొక్క ఫలితములను ఇంకను పెక్కుగ్రంథముల రూపమున ప్రకటింపం దలంచిరి. పై గ్రంథమునుగూడ సమగ్రముగా ప్రకటించుటకుమున్నే ౧౯౦౧ మార్చి ౭ తేదీన మరణించిరి. లోకులకు మొదటిభాగము మాత్రమే దక్కినది.

అప్పటప్పటికి శాస్త్రులవారు తాము సంగ్రహించిన విషయములను చేర్చి 'తమిళశబ్దతత్త్వము' (Tamil philology) అను గ్రంథమును ప్రకటించిరి. తర్వాత నాంధ్రశబ్దతత్త్వము (రెండుభాగములు), ఉద్ధానుస్వారతత్త్వము అనువ్యాకరణగ్రంథములను ప్రకటించిరి. ఈ గ్రంథములు పండితుల యాదరమునకు పాత్రములై యున్నవి.

అరవమునకు వాఙ్మయచరిత్రము ముఖ్యమని తలంచి తాము అప్పటప్పటికి పత్రికలలో ప్రకటించిన విషయములనన్నిటిని చేర్చి 'Essay on Tamil Literature' అనుపేరున ప్రకటించిరి.

శ్రీ శాస్త్రులవారు ఆఱునిఘంటువులను ఆఱుభాషలకు చెందినవానిని సిద్ధము చేయుచుండిరి ; అవి ముగింపునకు రాకుండఁగా గతించిరి. వీరు ౧౯౧౪ సం ఏప్రెల్ నెలలో ౧౬ తేది జరిగిన ఆంధ్రకవిపండితసంఘమునకు తాము రాలేమికై చింతించుచు శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యుల వారికి వ్రాసినలేఖ* యందు తమపరిశ్రమలగుఱించి నాలుగు పంక్తులు వ్రాసి యున్నారు. పైగ్రంథములుగాక శాస్త్రులవారువ్రాసిన గ్రంథము లెన్నియో గవర్న్మెంటువారు కోరఁగా పాఠశాలలకై పెక్కుగ్రంథముల ననువదించిరి. వారు నిరంతరము పంపుచుండు గ్రంథములపై నభిప్రాయములు వ్రాయుచుండిరి. ప్రాచ్యలిఖితగ్రంథములను శోధించుచు విమర్శలువ్రాయుచుండిరి. మిక్కిలి ముఖ్యమైన పౌరాణిక నామములగుఱించి కొన్నివ్యాసములను వ్రాసిరి. డాక్టరు ఐగ్నెలుదొరవారి నిఘంటువునకు వ్యాస మొకదానిని వ్రాసిరి.

శ్రీ శేషగిరిశాస్త్రులవారు సంగీతమందు అపార పాండిత్యముగలవారు, వారికి కర్ణాటకహిందుస్తానీ ఐరోపీయసంగీతములందు మూఁటియందును సమాన

* Owing to the pressure of official business and other causes, I have not been able to make up my mind to attend ........: The objects of the conference have my full sympathy and I shall do what I can for it. I have been engaged in a critical and comparative study of Tamil, Telugu, Kanarese, and Malayalam languages for more than twenty years. I wish to publish a philological dictionary for each of these languages and also for Sanskrit. I have published a grammar for Telugu under the designation of ఆంధ్రశబ్దతత్త్వము and a short treatise on the అర్ధానుస్వారము: The Tamil grammar is in the press. By to-day's post I forward to the conference copies of the above books, which I hope the conference will be good enough to accept as my humble quota to the literature and language of the Telugu countries. Any corrections and suggestions from the conference will be most thankfully received.

ప్రశ్నకలదు. ఆకాలమున (నేఁటికి ఏబదిరెండు సంవత్సరములకుపూర్వము) సంగీతసమాజ మొకటి ప్రత్యేకము ఐరోపీయపండితులచే జరుపఁబడుచుండి నది. అందు శాస్త్రులవారొకరే హైందవసభ్యులుగా నుండిరి. వీరు పై మూఁడు పద్ధతుల తారతమ్యముల నెఱింగినవారు గావునను, అందు పరిశ్రమ సల్పినవారు గావునను, ఆకాలమునందు విశ్వవిద్యాలయమున సంగీతము చే ర్చవలెనను గవర్నమెంటువారితరఫున డైరెక్టరుగారు శాస్త్రులవారిని కోరఁగా శాస్త్రులవారు సంగీత ప్రవచనము విశ్వవిద్యాలయమున ప్రారంభించుటకై విష యసంగ్రహాదులను వ్రాసి గవర్నమెంటువారికి పంపిరి ఇంతలో నుత్సాహమువలె వారి మరణము ఆయుద్యమము నాఁదివైచెను. వీరి తర్వాతవచ్చిన డాక్టర్ బోరన్ గారికి ఇందు శ్రద్ధలేమిచే నీయుద్యమము అడుగంటి నేఁటికాలము నకు మరల పైకివచ్చినది. శ్రీ శాస్త్రులవారే ఇంకను కొన్నిసంవత్సరము లుండిరేని నేఁడు ప్రారంభింపఁబడిన సంగీత ప్రవచనము విశ్వవిద్యాలయమున నాఁడే ప్రారంభింపఁబడియుండును.

శ్రీ శాస్త్రులవారియింట నిరంతరము విద్యావినోదములు జరుగుచుండె డివి. వీరి కుటుంబములో శాస్త్రులవారి అన్నగారగు శ్రీ కృష్ణయ్యగారును, వారితమ్ములగు శ్రీ రామచంద్రయ్యగారును, వేంకటేశ్వరశాస్త్రిగారును సంగీత విద్వాంసులు. అందు వేంకటేశ్వరశాస్త్రులవారు శేషగిరిశాస్త్రులవారితో అన్ని విధముల సమానులు; సంగీతమునందు గ్రంథములువ్రాసి ప్రకటించియున్నారు. వానిలో ప్రస్తుతింపఁదగినది సంగీతస్వయంబోధిని. శేషగిరిశాస్త్రులవారిచే సంగీతవిద్వాంసులేమి, తదితరులేమి, నిరంతరము బహూకృతు లగుచుండిరి. నాట్యాదికములలో ఒజ్జలు శాస్త్రులవారిని మొదట మెప్పించినవేగాని సభ లలో తమవిద్య చూపువారు కారు. ఇట్టివారిని పరీక్షించుటయందు శాస్త్రుల వారి బుద్ధి కుశాగ్రసదృశము. భరతశాస్త్రము వారికి కరతలామలకము. శాస్త్రులవారి యింట లక్ష్మీసరస్వతులు కలసిమెలసి వాసము చేయుచుండిరి. ఆగంతుకులు వారియింట నిరంతరము బహూకృతు లగుచుండిరి. లేనివారిని

మాసములపరకును తమ యింటనేయుంచుకొని పోషించిన దయార్ద్రహృదయులు శాస్త్రులవారు పెక్కుపండితులకు మార్గదర్శకులై హితోపదేశకులుం గావించినారు ఆంధ్ర విపండిత సంఘములో నొకరుగ సభ్యులై, అచ్చటి పండితుల మాత్సర్యముం గని, పండితులు జిజ్ఞాసువులై మెలంగవలయునని సెలవిచ్చిరి.

శ్రీ శేషగిరిశాస్త్రులవారింగూర్చి వారికి ఆప్తమిత్రులును, నిరంతరము వారిగోష్ఠిలో మెలఁగినవారును, అస్మత్పితామహులును అగు బ్రహ్మశ్రీ, కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రులవారు తమ యుషానాటకమును వారికి అంకితము గావించునెడ ముద్రించిన ప్రశంసావాక్యములు—"ఈ నాటకమును వీణాగానకళా నారదులును, సాంగ వేదములం దధీతులును, సర్వదర్శనములందు నదీష్ణులును, సంస్కృత ప్రాకృతాంధ్ర ద్రావిడ కర్ణాట మహారాష్ట్రాంగ్లేయ గ్రీకలాటి నాద్యష్టాదశ భాషాలక్ష్యలక్షణాభిజ్ఞసార్వభౌములును, ద్రావిడభాషా ఫైలాలజీ దగ్గన ప్రథమ ప్రవర్తకులును, మదరాస్ ప్రెసిడెన్సీ కాలేజీ ఫైలాలజీ ప్రాక్తనభాషామహోపాధ్యాయులును, బోధిసత్త్వకల్పులును అగు మన్మిత్రరత్నంబు తాతవెళ్లి మలబార్ శ్రీయుత శేషగిరిశాస్త్రులు ఎమ్ ఏ గారి కీర్తిమూర్తికి సమర్పించినాఁడను." అని.

ఈవిధముగా నిరంతరము శారదాదేవత నారాధించిన ఈమహనీయుని, అస్మన్మాతామహుని నామధేయము చిరంతరము స్మరణీయము. వీరి గోరాంధ్ర శబ్దతత్త్వము ఇంతకాలమునకు నాచే పునర్ముద్రిత మగుట మద్భాగ్యము. ఈ తాతగారింగూర్చినవృత్తాంతమంతయు నాకుం దెలిపిన మన్మాతులమహాశయులు కీ. శే. శ్రీ టి. ఎం. సుందరయ్యరుగారిని ఈసందర్భమున స్మరించెద.

మదరాసు
25 ఏప్రిలు 1948 }

వేదము వేంకటరాయశాస్త్రి. M. A.

శ్రీ

# పీ ఠి క

తెనుఁగు ద్రావిడభాషలలో మిక్కిలి సుందరమయినది. కావ్యాలంకారపురాణాద్యనేకవిషయములలోను జ్ఞానప్రదములయిన బహు గ్రంథములఁగలిగి విద్యాభ్యాసవ్యవహారములకు మిగుల నుపయోగమయినది యని యందఱికిని జక్కఁగా దెలిసి యున్నది. ఇతర ద్రావిడభాషలకంటె నధికవ్యాప్తి కలిగి అనేక దేశములలో వాడఁబడుచున్నది. చేరచోళపాండ్యదేశముల రాజులు బలహీనులయి యుండునపుడు విజయనగరమందు ఏలుచుండిన రాజులు దక్షిణమునందు సకలదేశములను దమ వశము చేసికొని ఏకచ్ఛత్రాధిపత్యముఁ జేయునపుడు ఆంధ్రదేశమునందలి ప్రజలు గుంపుగుంపులుగా దక్షిణ దేశమునకు వచ్చి అక్కడనే స్థిరముగా వసించినారు. ఇట్టి యనేక కారణములచే నాంధ్రభాష బహుదేశములందు వ్యాపించెను. ఈగొప్పభాషను వ్యవహరించువారలలో ననేక కవులును పండితులును శాస్త్రజ్ఞులు నుండిరిగాని, ఎవ్వరును భాషకుఁదగిన శుద్ధమయిన వ్యాకరణమును రచింపరయిరి. దీనికి కారణము ఆకవులును పండితులును శాస్త్రజ్ఞులును సంస్కృతభాషయందు పరిశ్రమముచేసి యాభాషయందు వ్రాయఁబడిన గ్రంథములనే పాఠప్రవచనముల మూలముగా నుపయోగించుచువచ్చిరి. ఆంధ్రభాషకు ప్రాచీనము

లయిన వ్యాకరణములు రెండుగలవు; వానిలో నొకటి ఆంధ్ర భాషకు ప్రథమకవియైన నన్నయభట్టారకులచేతను మఱియొకటి అథర్వణాచార్యులచేతను రచియింపఁబడెను. వెనుకటికాలము నందు అనేకపండితులు వ్యాకరణములు రచించినారు. వానిలో ననేకములు ముద్రింపఁబడి యున్నవి, కొన్ని గ్రంథములు ముద్రింపఁబడక వ్రాఁత పుస్తకములలో నగపడుచున్నవి వీనిలో ముఖ్యమయినది ఓల్డుకాలీజు పండితులయిన పట్టాభిరామశాస్త్రు లచే రచియింపఁబడినది. ఇది రాజకీయపూర్వదేశీయలిఖితపుస్తక శాలలో (Govt. Oriental MS. Library) కాకితపు బుస్తకములో వ్రాయఁబడియున్నది. ముద్రింపఁబడి మిగుల వాడుకలో నుండునవి, పరవస్తు చిన్నయ్యసూరిగారిచే రచియింపఁబడిన బాలవ్యాకరణము, వెంకయ్యగారి వ్యాకరణము. పైచెప్పిన అన్ని వ్యాకరణములును ఒకదారినే యవలంబించినవి; ఆది వైయాకరణులయిన నన్నయభట్టారకుల వ్యాకరణమును ఆధారముగాఁగొని రచియింపఁబడినందున మూలగ్రంథమునందుండు భ్రంశములన్నియు వానియందు నున్నవి. నన్నయభట్టారకులే శబ్దస్వరూపములను జక్కఁగఁ దెలిసికొనక బుద్ధికిఁదోఁచినట్లు లక్షణములను జెప్పినారు. వారుభ్రమించి చెప్పిన విషయములను ఇతర వైయాకరణులును ఒప్పులుగానే గ్రహించి తమతమ గ్రంథముల నొనరించినారు.

అఱవమునందును కన్నడమునందును శబ్దలక్షణములను జెప్పినవారలు తెలుచుగా శబ్దస్వరూపములను విమర్శించి లక్షణ

ములు చెప్పియున్నారు. కావున వారి గ్రంథములలో భ్రంశ ములు మెండుగాఁ గానంబడవు.

ఈ ప్రసక్తియందు లక్షణశబ్దముయొక్క అర్థమును కొంత విచారింపవలయును. లక్షణమనఁగా ఒక వస్తువుయొక్క సత్యమయిన స్వరూపమును దెలుపునట్టి వాక్యము; ఇది రెండు విధములు, కాల్పనికము, వాస్తవము. ఉదాహరణము: 'పోవు తెంచు' అను సమస్తధాతువు 'పోవు' 'తెంచు' అను పదముల వలన వచ్చెను. పోవు - 'పోవుట', తెంచు - స్వార్థమునందు వచ్చినది, అనఁగా 'పోవుట' అని యర్థము; ఈలక్షణము కాల్ప నికము, వాస్తవము కాదు. 'పోవు తెంచు' అనుపదములోనుండెడి 'తెంచు' అను ఉత్తరపదము ఖండసార్థకమయిన తెంచుధాతు వయినయెడల దానికి తుమున్నంతరూపము 'తెంపఁగా' అని కావ లయును; అట్లు కాదు, 'తేరఁగా' అని అగును; కాఁబట్టి 'పోవు తెంచు' అను సమస్తధాతువు 'పోవు తెచ్చు' అనుదాని వికా రము కావలయును. ఈ కారణమువలన ఖండసార్థకమయిన 'తెంచు' ధాతువుపోవు ధాతువుతోఁ జేరుట చేత 'పోవు తెంచు' పదము పుట్టుననుట కాల్పనిక లక్షణము. పోవు, తెచ్చు అను ధాతువులు చేరి పోవు తెంచు అయినవి యని చెప్పుట వాస్తవ లక్షణము. ఇట్లే 'చేసితిని' అను క్రియాపదమును చేయు+ఇ+ తి+ని అని విభజించి, ఇ భూతార్థక ప్రత్యయమనియు, ని ఉత్తమ పురుషైకవచన ప్రత్యయమనియు తి వర్ణకంబనియు చెప్పుట కాల్పనికలక్షణము, అవాస్తవము. చేసితిని=చేయు+ఇత్+ఇన్+

ఇ అనుట వాస్తవలక్షణము; ఏలయనిన, దానికి సరియైన ద్రవిడ కన్నడ పదములు క్రమముగా శెయ్దేన్, గెయ్దెన్ అనునవి. శెయ్దేన్=శెయ్+ద్+ఏన్, గెయ్దెన్=గెయ్+ద్+ఎన్. వీనిలో శెయ్, గెయ్ ధాతువులు; ద్ భూతార్థకప్రత్యయము; ఏన్, ఎన్ ఉత్తమపురుషైకవచనప్రత్యయములు. అఱవపదమగు 'శెయ్దేన్' అనునది తెనుఁగునందు 'చేయిఁతిని' అనియయి యకారమునకు సత్వముఁరాఁగా 'చేసితిని' అని అయినది. అఱవమునందు హలంతమయిన పదము తెనుఁగునరాఁగా దాని కడపట అ, ఇ, ఉ, అను అచ్చులలో నొకటి చేర్పఁబడును. ఈవిధిచేతను ఇకారము చేర్పఁగా శెయ్దేన్+ఇ=చేయిదిని=చేసితిని అని రూపభేదమువచ్చెను. పై జెప్పిన వ్యుత్పత్తులను క్రిందవ్రాసి పోల్చి చూడవలయును.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| తె. | చేయు | + | ఇ+తి | + | ని | = | చేసితిని |
| అ. | శెయ్ | + | ద్ | + | ఏన్ | = | శెయ్దేన్ |
| క. | గెయ్ | + | ద్ | + | ఎన్ | = | గెయ్దెన్ |

తెనుఁగుపదమందున్న ని అనునక్షరములోని ఇకారము ఉచ్చారణార్థము చేర్పఁబడినది. అదిపోఁగా నకారము మిగిలియున్నది. ఈ నకారము ఎన్ అను ఉత్తమపురుషైకవచనప్రత్యయముయొక్క భాగము. ఈ ఎన్ ప్రత్యయమే తెనుఁగునందు ఇన్ అయినది; కావున భూతార్థకప్రత్యయము ఇత్ అను దానిని వేఱుచేసి ఇన్ అనుదానిని ఉత్తమపురుషైకవచన ప్రత్యయమని చెప్పవలయును. అఱవపదముయొక్క ద్ అనుభూతా

ర్థక ప్రత్యయమునకు సమమయిన ఇత్ అనుదానిని భూతార్థక ప్రత్యయముగా గ్రహింపవలయును. ఇట్లే సంస్కృతమునందు పతిత, కృత, మ్లాన అను వానియందు త ప్రత్యయము కేవలము గాను, ఇ కారాగమముతోఁజేరి ఇత అనియు, త కారమునకు న కారాదేశము రాఁగా, న అనియు వచ్చును.

ఇదిగాక,

మ్రాఁకులు ... (అ. మరజ్గళ్, క. మరంగళ్)
కొలంకులు } ... (అ. కుళజ్గళ్
కొలఁకులు } ... క. కుళంగళ్).

అను నీ పదములలో బహువచన ప్రత్యయము కులు అనునదియేగాని ఉలు అనునది కాదు. ఉలు అనుదానిని తప్పుగాఁ బ్రత్యయమని గ్రహించుటచేత మ్రాఁకు, కొలంకు,కొలఁకు అని భాషలో లేని అపశబ్దములు వైయాకరణుల యజ్ఞానముచేత నేర్పడినవి.

ఈలాగుననే ఆంధ్రపండితులు అర్ధానుస్వార శకటరేఫ ములయొక్క కారణములను తెలిసికొనక అవియుండవలసిన పద ములలో వానిని విడిచిపెట్టియు అవి లేనిపదములలో* వాని నుపయోగించియు భాషలో లేని తాలుమాలులను తెచ్చికొ న్నారు. ఇట్లుండుటవలన నర్ధానుస్వార శకటరేఫములు అనా వశ్యకమని వానిని విడిచిపెట్టెడి యాధునిక పండితులపై దోష ము చెప్పుటకు అవకాశము లేకయున్నది.

* అర్ధానుస్వారతత్త్వమునుజూడుము.

ఆంధ్రభాషా వైయాకరణులు ఇట్లు వ్యాకరణములో ప్రక్రియలందు మాత్రమె తప్పినవారు కారు. వ్యుత్పన్న శబ్దము యొక్క స్వరూపములను సరియుతము తెలిసికొనక వానిని యథేచ్ఛముగా మార్చి విరూపము చేసి ఉపయోగించినారు.

ఇట్లు అనేక విషయములలో తెనుఁగు వ్యాకరణములందు శబ్దస్వరూపములకు విరుద్ధమయి కేవల కాల్పనికలక్షణములను చెప్పియుండుటచే నవి బాలురకు జ్ఞానప్రదములును ఉపయుక్తములును గావు. అదియునుంగాక నన్నయభట్టారకుల యాంధ్రశబ్దచింతామణి, చిన్నయ్యసూరిగారి బాలవ్యాకరణము మొదలయిన గ్రంథములందు పాణినీయవ్యాకరణపరిభాషల ననుసరించి శబ్దలక్షణములను సూత్రరూపములయిన అతి లఘువాక్యములచేఁ జెప్పియుండుటచే నవి బాలురకు మాత్రము గాదు ఉపాధ్యాయులకును దురవగాహమనుటకు సందియము లేదు ప్రాచీనకాలము లో నొక్కొక విషయమును దెలిసికొని ఆ విషయమునందు వ్రాయఁబడియుండు గ్రంథములను మాత్రము చదువుచుండిన పండితులకు తమ కాలమంతయు గడపుటకు అట్టి గ్రంథములు ఉపయుక్తములే. ఈ కాలమునందు ఉపయుక్తములయిన అనేక విషయములను దెలిసికొనుట జనుల జీవయాత్రకు ఆవశ్యకముగా నుండఁగా వ్యాకరణమును మాత్రము చదువుచు అధిక కాలముఁ గడుపుట ఎట్లు ?

నన్నయ్యభట్టారకుల వ్యాకరణమును అథర్వణాచార్యుల వ్యాకరణమును సంస్కృతమునందు వ్రాయఁబడియున్నవి.

చిన్నయ్యసూరి బాలవ్యాకరణము తెలుఁగున వ్రాయఁబడియుండినను పైఁజెప్పిన వ్యాకరణములవలె పాణినీయవ్యాకరణపరిభాషలను అవలంబించి లక్షణములను జెప్పుటచే దానిని జదువుటయు బోధించుటయు మిక్కిలి కష్టముగానున్నది. ఈ వ్యాకరణముల రీతిని జూడఁగా నవి సంస్కృత భాషయందు వ్యుత్పత్తి గలిగి పాణినీయ వ్యాకరణముఁ జదివిన పండితులకుమాత్రము ఆంధ్రభాషా స్వరూపముఁ దెలుపుటకు వ్రాసినట్లు ఎల్లరకుఁ దెలియవచ్చును. ఈ విషయమునకు ఒక యుదాహరణము నిత్తును.

(౧) జిత్తు అనఁగా జికారము ఇత్తుగాఁగలిగినది.

(౨) ఇత్తు అనఁగా నొకకార్యమును దెలుపుటకు ప్రత్యయముతో జేర్పఁబడు అక్షరము. ఈ సంగతిని పాణినీయవ్యాకరణమువలనఁ దెలిసికొనవలయును. ఇత్తుల కార్యమును దెలిసికొని వానిని ప్రత్యయములనుండి ఎత్తివేయవలెను.

జిత్తులయిన ప్రత్యయములు ఏవియనఁగా,—

లజి (చిన్నయ్యసూరి వ్యాకరణమునఁ గ్రియాప్రకరణములో ౭-వ సూ. చూడుము)

కలజి ( ౧౯-వ సూ. చూ. )—చేయఁగల.

కుజి ( ౩౨-వ సూ. చూ. )—చేయకుమ.

వుజి } ( ౩౪-వ సూ. చూ.) { —చేయవె, చేయరే, చేయకువె,
యజి } { —చేయకురే.

మిజి ( ౩౭-వ సూ. చూ. )—చేయమి.

కజి ( ౩౯-వ సూ. చూ. )—చేయక.

నుశి ( ౪౦-వ సూ. చూ. )—చేయును, చేయున్.

కలజి ( ౪౫-వ సూ. చూ. )—చేయఁగల.

నిజి ( ౪౭-వ సూ. చూ. )—చేయని.

బడుజి ( ౪౯-వ సూ. చూ. )—చేయఁబడు.

౨౦-వ సూత్రముచే జికారము ఇత్తుగాఁగల ప్రత్యయము రాఁగా ధాతువుయొక్క తుది యుకారమునకు అకారాదేశము వచ్చును.

౭-వ సూత్రముచే చేయుధాతువునకు లజి ప్రత్యయము రాఁగా

౧ చేయుం + లజి అని నిలుచును.

పైఁజెప్పిన (౨) విధిచే జికారమును ఎత్తివేసి లకారమును మాత్రము ప్రత్యయముగా గ్రహింపవలయు.

చేయు+లజి అనుదానియందు జి అను ఇత్తుఁచేఁ దెలుపఁబడు కార్యమయిన ధాతువుయొక్క తుది యుకారమునకు అకారాదేశము చేయఁగా,

౨ చేయ+ల అని నిలుచును.

3 ౮-వ సూత్రముచే

పైఁజెప్పిన ల ప్రత్యయమునకు

ఏకవచనమున—డుఙ్, వు, ను

బహువచనమున—రు, రు, ము

అను నీ ప్రత్యయములు ఆదేశముకాఁగా

౪ చేయ + డుఙ్ ... చేయ + రు

చేయ + వు ... చేయ + రు

చేయ + ను ... చేయ + ము అని నిలుచును.

జిత్తు బిందుపూర్వకంబగు. (౧౯-వ సూ. తత్సమపరిచ్ఛేదము)

ఈసూత్రముచే,

౫. చేయు + డుజ్     చేయు + ండు అగును.

ప్రకృతిప్రత్యయములను జేర్చివ్రాయఁగా

చేయుండు ... చేయరు

చేయువు ... చేయరు

చేయును ... చేయము అనివచ్చును.

ఈ పైఁజెప్పిన వ్యతిరేకక్రియలకు క్రిందువచ్చువిధంబున వ్యాకరణలక్షణములను జెప్పిన నతి సుభముగానుండును.

విధి ౧. వ్యతిరేకపూర్ణక్రియలకు, అండు—అరు, అవు—అరు, అను—అము, ప్రత్యయములు.

విధి ౨. వ్యతిరేకక్రియలకు సామాన్యసూత్రము

వ్యతిరేక క్రియలలో భావక్రియలోని ప్రత్యయము యొక్క ఆదిహల్లునకు పూర్వము అకారముఁ జేర్పవలయు. ఈ అకారము వ్యతిరేకద్యోతకము.

చేయు + అ + వ + వాఁడు—చేయుండు. ఇట్లు చేయరు మొదలయినవి వచ్చును.

చేయు + అ + క = చేయక; వ్యతిరేకక్త్వార్థకము. చేసి, చేయుచు అనువానికి వ్యతిరేకరూపము.

చేయు + అ + ని = చేయని; వ్యతిరేకనామ విశేషణము. చేసిన, చేయుచున్న, చేయుఁన్ అను వానికి వ్యతిరేకరూపము.

చేయు + అ + మి = చేయమి. వ్యతిరేకభావనామములను చేసినమి (అ. కొద్దుమై), జేయుచున్నమి (అ. కొద్దుత్తమై) అనువాని వ్యతిరేకరూపము.

చేయుప అనునది భవిష్యదర్థకవిశేషణము, కన్నడము నందు గెయ్యువ అనుదానికి సమము. వాఁడు సర్వనామము. అండు అని యగును. చేయువవాఁడు చేయువండు అని వికార మును బొందును. వ్యతిరేకార్థక ప్రత్యయమయిన అకారము భవిష్యదర్థక వకారమునకు మునుపు చేర్పఁబడెను. వాఁడు అను సర్వనామము అండు అయి సర్వనామార్థమునువిడిచి కేవలపుం లింగైకవచన ద్యోతకమయిన ప్రత్యయమగును. ఈవివరమును వ్యతిరేక క్రియా ప్రకరణమునందు చూడుము.

ఇట్లు శబ్దస్వరూపములను అనుసరించి యుండెడు వాస్తవ లక్షణములచే శబ్దములను విశదముగాఁ దెలిసికొనుట ఎంత సులభము ! ఎంత లాభకరము !

పైఁజెప్పిన క్రియలలో ప్రకృతి ప్రత్యయములకు నడుమ వచ్చెడు అకారము వ్యతిరేకద్యోతకము.

౩౨, ౩౪, ౩౫, ౩౬, ౩౯, ౪౦, ౪౫, ౪౬, ౪౯-వ సూత్రములకు లక్ష్యమయిన చేయకుము, చేయవె, చేయరె, చేయకువె, చేయకురె, చేయమి, చేయక, చేయక—చేయక, చేయఁగల, చేయని, చేయఁబడు ఈ క్రియల స్వరూపము వానితోఁబోల్పఁబడిన ద్రవిడకన్నడపదములచే విశదమగును.

చేయకుమా (అ. శెయ్యఱ్కు)
చేయవె (అ. శెయ్యాయ్, క. గెయ్యయ్)
చేయరె (అ. శెయ్యార్, క. గెయ్యర్)
(అ. శెయ్యార్, క. గెయ్యర్)
చేయకు } (అ. శెయ్యఱ్కు)
చేయకురె }

* చేయన్ – చేయను (అ. శెయ్యల్, క. గెయ్యల్)

చేయని (అ. శెయ్యాద, క. గెయ్యద)

* చేయంబడు / చేయఁబడు } { అ. శెయ్యప్పడు / అ. శెయ్యల్పడు } క. గెయ్యల్పడు

* చేయంగల / చేయఁగల } (అ. శెయ్యలుళ్ళ, క. గెయ్యలుళ్ళ)

చేయమి (అ. శెయ్యామై.)

చేయక (అ. శెయ్యాద, శెయ్యాదు.)

(క. గెయ్యద, గెయ్యదె.)

ఇచ్చట నక్షత్రపుగుఱుతు లేని క్రియాపదములలోని ధాతువు తుదియకారము వ్యతిరేకద్యోతకమనియు మిగిలిన క్రియాపదములలోని అకారము అట్టిదిగాదనియు వాని ప్రక్కలో నియ్యఁబడిన ద్రావిడ కన్నడపదములవలనఁ దెలిసికొనవచ్చును. అట్లుండఁగా ధాత్వంతో కారమునకు అకారము ఆదేశమగునని వ్యతిరేకద్యోతకాకారమునకును వేఱు అకారమునకును భేదము లేక విధించుటచేత సంశయమును భ్రాంతియుఁ గలుగునుగాని వివేకము కలుగదు.

ఇట్లే "ముజ్ జీత్తులు ముత్తుగాఁబడు" అనునది మొదలయిన సూత్రములచే జీత్తులకుఁ జెప్పఁబడిన విధులను ఈ వ్యాకరణమునందుఁ జెప్పఁబడిన విధులతోఁబోల్చి చూచిన యెడలఁ బ్రాచీన వ్యాకరణము లెంత దురవగాహములనియు,

ఈగ్రంథము ఎంత సులభమనియు, పండితులకుఁ దెలియ వచ్చును.

పైఁజెప్పినవానిలో సారాంశ మేమనిన శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము చెప్పవలసిన విషయములను సులభముగాఁ జెప్పుట. అట్లు చెప్పక మిక్కిలి దురవగాహమయిన పదముల తోను వాక్యములతోను పారిభాషికనిబంధనలతోను చెప్పఁ బూని, సులభముగాఁ దెలియఁదగిన విషయమును మఱుఁగు పెట్టినయెడల శాస్త్రోద్దేశము నెఱవేఱునా? రెండవది, చెప్పవల సిన శబ్దలక్షణములను శబ్దస్వరూపముల ననుసరించి చెప్పక స్వరూపములకు విరుద్ధములును భ్రాంతికరములును అయిన అపలక్షణములను చెప్పెడు విధి విధియగునా? అట్టివిధులు మెండుగాఁ గలిగిన శాస్త్రము శాస్త్రమగునా?

ఒక్కొకపదముయొక్క స్వరూపమును దెలిసికొనుట ఎట్లు ఆవశ్యకమో అట్లె వ్యుత్పన్నపదములయొక్కయు విభక్తి రూపములయొక్కయు అవయవాంశములను దెలిసికొనుట యావశ్యకము. పోవుచున్నాను, వచ్చుచున్నాను అనునవి స్వరూపములు; పోసాను, వస్సాను అనునవి అపశబ్దములని తెలిసికొనవలయు. పోవుచున్నాను=పోవు+చున్న+ఆను; వచ్చు చున్నాను=వచ్చు+చున్న + ఆను అని విభజింపవలయు. పోవు చున్నాను=పోవు+చు+ఉన్న+ను; వచ్చుచున్నాను = వచ్చు+చు + ఉన్న + ను అని వ్యాకరించుట స్వరూపవిరుద్ధలక్షణము.

చేయక (అ. శెయ్యాద, క. గెయ్యద) = చేయు + అ + క; అకారము వ్యతిరేకద్యోతకము, కకారము నామవిశేషణ ప్రత్యయము. ఇట్లుచెప్పక కకారము భావార్థకము, అకారము దానికి మునుపు నిరర్థకముగా వచ్చినదని చెప్పుట స్వరూప విరుద్ధలక్షణము. రాక, పోక అను భావనామములందు క ప్రత్యయముగలదు పూనిక, తేలిక అనుభావనామములందు కప్రత్యయమును కకారమునకు పూర్వము ఇకారాదేశమును గలవు. భావార్థక కప్రత్యయమునకు పూర్వము అకారాగమము తెనుఁగుభాషలోఁగాని ఇతర ద్రవిడ భాషలలోఁగాని రాదు. కాబట్టి చేయక అనుపదములో కకారము భావార్థక ప్రత్యయమనియు అకారము దానికి మునుపు ఆగమముగా వచ్చినది యనియు చెప్పుట అశాస్త్రీయము.

ఇదియునుం గాక; కలజీ, పడుజీ ప్రత్యయములు పరమగునపుడు నుగాగమంబగు. ౨౦-వ సూత్రముచేతను జీత్తు పరంబగునపుడు ధాతువుయొక్క ఉకారమునకు అత్వము వచ్చును.

చేయుం + కలజి = చేయు + అ + న్ + కల =

చేయన్ + కల = చేయంగల, అథవా చేయగల.

కల అనునది అనుబంధమగుటచే

చేయనుగలయని గాని } రాదు.
చేయన్గలయనిగాని

అట్లె, చేయు + పడుజి = చేయు + అ + న్ + పడు

చేయంబడు, చేయంబడు.

ఈ వివరముచేత చెయఁబడు అను పదంబునకు వాల్గు అవయవములు ఏర్పడుచున్నవి. అది స్వరూపవిరుద్ధము.

చేయంబడు అను పదమునకు సమానము అరవమున శెయ్యప్పడు, శెయ్యప్పడు, కన్నడమున గెయ్యల్పడు, గెయ్య పడు అనునవి. వీనిలో శెయ్యల్పడు, గెయ్యల్పడు ప్రాచీన రూపములు. వానిని జూడఁగా నవి సమస్త ధాతువులని మన ము దెలిసికొనవచ్చును. చక్కఁగాఁ బరీక్షించి చూడఁగా, శెయ్యల్, గెయ్యల్ నామములనియు, పడు ధాతువనియు శెయ్యల్ గెయ్యల్, 'చేయుట' పడు 'ఉత్పత్తియగుట' ఇత రులు చేయు పనిని దనయందుఁ గలిగియుండుట అనగా నిత రుల వ్యాపారములకుఁ గర్మముగా నుండుటయని యర్థము. ఇట్లే తెనుఁగునందును చేయఁబడు అనుపదమునకు చేయన్ 'ఇతరులు చేయుట', పడు, 'తనయందుఁ గలిగియుండుట' అనఁగా నితరుల వ్యాపారమునకుఁ గర్మముగా నుండుటయని యర్థము. 'కుమ్మరవాని చేతఁ గడవ చేయఁబడుచున్నది' అనఁగాఁ గుమ్మర వాఁడు చేయుపనికిఁ గడవ కర్మముగా నున్నది యని యర్థము. ఇట్లు సులభమయిన అర్థము ననుసరించి చేయఁబడు అను పద మును చేయఁ పడు అను రెండవయవములుగా విభజించి, చేయఁ అనుదానిని భావనామముగాను పడు అనుదానిని దాని

తో సమస్తమయిన ధాతువుగాను గ్రహించునది ఎంత సుక రము! ఇదియే వాస్తవ లక్షణము. దానిని నాల్గవయవములు గలిగినదిగా గ్రహించుట అశాస్త్రీయము; స్వరూపవిరుద్ధము. ఇట్టి శాస్త్రములను ఎంత చదివినను మనుష్యునికి జ్ఞానము పుట్టదు. చక్కెరను భుజించునపుడు వేఁపాకుముద్దయందు దానిని పెట్టి ఆవేఁపాకు ముద్దను తినువారు లోకములో నెవరుగలరు! ఋజువుగా నుండు సమీపమయిన దారిని విడిచి నాలుగామడ దూరముచుట్టి కాలునొప్పి తలనొప్పులతోఁ బోవుటకు ఎవరు ఇచ్ఛింతురు? ఆంధ్రభాషా వ్యాకరణములు ఇట్లుండుటఁబట్టి పాఠశాలలలోఁ జదువు బాలురకు ఎంత ప్రయాసము! ఉపా ధ్యాయులకు ఎంత ప్రయాసము! ఇంత ప్రయాస సాధ్యము లయిన వ్యాకరణములను కష్టపడి చదివినను, చదివినదానిని జ్ఞప్తియందు ఉంచుకొనుట దానికంటెఁ గష్టతరమగుటచేఁ జది వినదంతయు నుపాధ్యాయులకే సమర్పితమగును.

ఈ కారణములచేఁ దెనుఁగుభాషకు మంచి వ్యాకరణము లేకయున్నది. తెనుఁగు, అరవము, కన్నడము, మళయాళము ఈ నాలుగుభాషలనుఁ జక్కఁగాఁజదివి ఒక్కొకభాషయం దుండెడు పదములను వ్యాకరణప్రక్రియలను ఇతరభాషలలో నుండు వానితోఁబోల్చి ప్రకృతిప్రత్యయాద్యవయవములను వానిమార్పులనుఁ బరిశీలించి ఈవ్యాకరణమును అనేక సంవత్సర ములకుముందు రచియించితిని; దానిని పండితులతోఁ జర్చించు చును, ఎఫ్. ఎ., బి. ఎ. తరగతులయందు బాలురకు బోధించి

వారి యాక్షేపములకు సమాధానముఁ జెప్పుచును, కాల క్రమమున తెలియవచ్చిన దోషములను దిద్దుచును, గ్రంథ మును పలుమాఱు శోధించియుండుటఁబట్టి అది యందఱకును ఉపయుక్తమగునని నాకుఁ దోఁచినదానిచే దానిని ముద్రించి విద్వాంసులకు సమర్పించియున్నాను. ప్రాచీన వ్యాకరణము లందు దోషములు నాకుఁ దోఁచినట్లు ఈవ్యాకరణములోని దోషములు పండితులకుఁ దోఁచినయెడల వారు నాకుఁ దెలియఁ బఱతురని ప్రార్థించెదను. అట్లు తెలుపు వారలకు మిగులఁ గృతజ్ఞతఁ దెలిపి స్ఖాలిత్యములను దిద్ది ఈగ్రంథమును జక్కఁ జేసికొనుదును.

1896.సం॥
ఏప్రిల్ 28-వ తేది.

శేషగిరిశాస్త్రి.

శ్రీ

# ఆంధ్ర శబ్దతత్త్వము



## సంజ్ఞా ప్రకరణము.

**1.** ఆంధ్రభాషలోని పదములు తత్సమము, తద్భవము, దేశ్యము అని మూఁడు విధములు కలిగినవి.

**2** తత్సమము సంస్కృత ప్రాకృతములనుండివచ్చి అక్షరభేదము లేక ఉపయోగింపఁబడునది. పదాంతమునందు ప్రత్యయములు చేరునపుడు సంధిచేత వచ్చు వికారములును, ప్రత్యయములు లేకయే వచ్చు వికారములును ఉండవచ్చును.

ఉ. దూత, హరి, శ్రీ, రమ, లత, రాముఁడు, కృష్ణుఁడు, విష్ణువు, శంభుఁడు, గురువు, తనువు, విధాతృఁడు, హనుమంతుఁడు, అంగిరుఁడు, అంగిరసుఁడు, మొదలయినవి.

| తెనుఁగు. | | | | సంస్కృతము. |
|---|---|---|---|---|
| దూత | ... | ... | ... | దూతః |
| హరి | ... | ... | ... | హరిః |
| శ్రీ | ... | ... | ... | శ్రీః |
| రమ | ... | ... | ... | రమా |
| లత | ... | ... | ... | లతా |

ఈ పదములయందు సంస్కృత పదములయొక్క అంతమందుండు విసర్గములు లోపించినవి, దీర్ఘములు హ్రస్వములు అయినవి.

| | | | |
|---|---|---|---|
| రాముఁడు | ... | ... | రామః |
| కృష్ణుఁడు | ... | ... | కృష్ణః |
| విష్ణుఁడు | ... | ... | విష్ణుః |
| శంభుఁడు | ... | ... | శంభుః |
| గురువు | ... | ... | గురుః |
| తరువు | ... | ... | తరుః |
| విధాతృఁడు | ... | ... | విధాతృ |
| హనుమంతుఁడు | | ... | హనుమన్ |
| అంగిరుఁడు / అంగిరసుఁడు | | ... | అంగిరస్. |

రాముఁడు, కృష్ణుఁడు:—ఈ పదములయందు సంస్కృత పదాంతమునందుండు విసర్గమునకు లోపమును, పుంలింగ ప్రథమైకవచన ప్రత్యయమైన ఉండు ప్రత్యయమును, పదాంతమునందుండు అకారమునకు లోపమును వచ్చియున్నవి.

విష్ణుఁడు, శంభుఁడు:—ఈ పదములయందు సంస్కృత పదముల యొక్క అంతమునందుండు విసర్గమునకును తత్పూర్వమయిన ఉకారమునకును లోపమురాఁగా ఉఁడు ప్రత్యయము చేరియున్నది.

గురువు, తరువు:—ఈ పదములయందు విసర్గలోపమును, ఉ ప్రత్యయమును, పదాంతమునందుండు ఉకారమునకును ప్రత్యయోకారమునకును మధ్యమున వకారాగమమును * వచ్చియున్నవి.

విధాతృఁడు:—ఈ పదము విధాతా అను పదముయొక్క ప్రాతిపదికమైన విధాతృ అనుదానికి 'ఉఁడు' ప్రత్యయముచేర్చి ప్రత్యయోకారమునకు లోపము చేయుటచే సిద్ధించునది.

* సంధిప్రకరణము చూడుఁడు.

హనుమంతుఁడు, అంగిరసుఁడు:—ఈపదములను పైఁజెప్పినవాని వలెనే సిద్ధించునవి. హనుమంత్, అంగిరస్ అనునవి తెనుఁగునందు ప్రాతిపదికము. 'అంగిరుఁడు' అను పదంబునందు ఉఁడు ప్రత్యయము చేరఁగా అంగిరస్ శబ్దముయొక్క తుదియందుండు అస్ అనుదానికి లోపము.

ఇవి సంస్కృతసమములు.

'ప్రాకృతమనఁగా' ప్రకృతివలనఁ బుట్టినది. ప్రకృతి సంస్కృతము. ఈ భాష సంస్కృత నాటకములం దుపయోగింపఁబడునది.

| తెనుఁగు. | | ప్రాకృతము. | | సంస్కృతము. |
|---|---|---|---|---|
| అగ్గి | ... | అగ్గీ | ... | అగ్నిః |
| రాణి | ... | రాణీ | ... | రాజ్ఞీ |
| తంతి | ... | తన్తి | ... | తన్త్రీ |
| సిరి | ... | సిరీ | ... | శ్రీ |
| విన్నాణము | ... | విణ్ణాణమ్ | ... | విజ్ఞానమ్ |

విన్నాణము:—ఇది ప్రాకృత పదమునకు ఉ ప్రత్యయము చేర్చుటచే వచ్చినది. విన్నాణమ్+ఉ=విన్నాణము.

ఇవి ప్రాకృతసమములు.

3. తద్భవము సంస్కృత ప్రాకృతమువలనఁ బుట్టినది.

| తె. | | | సం. |
|---|---|---|---|
| సాయము | ... | ... | ఉ. సహాయః |
| సామి | ... | ... | స్వామి |
| సాదనము | ... | ... | సాధనమ్ |
| గారాబము | ... | ... | గౌరవమ్ |
| బస | ... | ... | వాసః |
| బసవఁడు | ... | ... | వృషభః |

కందుఁడు ... ... స్కాన్దః
ఓలి-'వరుస.' ... ... ఆవళిః

**4.** దేశ్యము ఆంధ్రదేశవ్యవహారసిద్ధమైనది. ఇది ద్రావిడ కర్ణాటకభాషలనుండి వికృతములయ్యో నవికృతములయ్యో వచ్చినదియు, ఆంధ్రదేశముననే కలిగినదియు అని రెండు విధములు గలది అగును.

తె. అ.

పడమర:— పడువానమ్ = పడు - 'అస్తమించునట్టి,' వానమ్ - 'ఆకాశము;' 'సూర్యుఁడు అస్తమించునట్టి యాకాశము:' అనఁగా 'పశ్చిమదిక్కు.' మలయాళములో పడిఞ్ఞాఱు = పడు ఞాయిఱు, పడు - 'అస్తమించునట్టి', ఞాయిఱు - 'సూర్యుఁడు', 'అస్తమించెడు సూర్యుఁడు,' అనఁగా 'పశ్చిమము.'

నలువ:— నాల్వాయ్ = 'నాలుగు నోళ్లుగలవాఁడు', 'బ్రహ్మ'.

కాలువ:— కాల్వాయ్ = కాలు - 'ప్రవహించు', వాయ్ - 'మార్గము.'

కైదువు:— కైతువ్వు = కై - 'చేయి', తువ్వు - 'ఆయుధము', 'చేతి యాయుధము.'

కొడవలి:— కొయ్వాళ్ = కొయ్ - 'కోయునట్టి', వాళ్ - 'కత్తి'.

కోవెల, కోయిల, } కోయిల్ = కో - 'రాజుయొక్క', ఇల్ - ఇల్లు, 'రాజనగరు'; 'దేవాలయము'

కాణాచి:— కాణియాట్చి = కాణి - 'నేల', ఆట్చి - 'స్వామ్యము.'

నూయి, నుయ్యి, } — నుఴై* - 'ద్వారము'.

గొయ్యి:— కుఴి - 'పల్లము', 'గుంట'.

---

* అరవమునందలి ఴ కు బదులు 'ఱ' ఇందుపయుక్తము.

బుగ్గ: — పొయ్గై - 'సరస్సు'.

గ్రొయ్యి: — కుఱికి - 'పల్లము.'

వ్రయ్యి: — పిరి - 'పగులు'.

గాలి: — కాల్; ప్రాచీనమయిన యీ ఆఱవపదము సాధారణభాషలో కాఱ్ఱు * అని మాఱి వచ్చును.

చీలు: — కీళ్.

చినుఁగు: — కిఴి.

గిలుబు: — కళవు 'దొంగతనము.'

గెలివి: — కళిప్పు 'ఉల్లాసము.'

గుడుసు: — కుటి 'వర్తులము.'

తె. క.

కెలసము: — కెలసవు, అ. కిరికై, సం. క్రియా. యా[illegible]త్వము.

మాట: — మాతు.

గండఁడు: — గండను, అ. కణవన్ - 'పతి.'

మిండఁడు: — మిండను.

ఎచ్చరిక: — ఎచ్చరికె, ప్రా. క. ఎఱుతరువికె. ఎఱుతరు - 'లేయు', ఇకె- భావనామప్రత్యయము; ఎచ్చరికె - 'లేచుట.'

ఎంగిలి: — ఎంజలు, అ. ఎంజల్, ఎచ్చిల్ - 'ఉచ్ఛిష్టము.'

తండ్రి: — తందెయను, అ. తంద్రైయార్.

క్రోతి: — కోడగితి - 'అఁడుగోతి.' ఓకారము డకారమునకు ముందు వచ్చి ఆకారమునకు ఆదేశమాయెను. గికారలోపము, డకారమునకు రత్వము.

---

* అరవపదమునందు వచ్చెడు ఱ వ్వయము కొంచెము ఎచ్చుతక్కువగా తద్వయమువలె పలుకుచున్నది. శుద్ధోచ్చారణమును అరవము దెలిసినవారు ఉచ్చరింపఁగా విని తెలిసికొనవలయును.

**5.** లక్షణ విరుద్ధములయిన పదములు గ్రామ్యములు.

ఉ. వస్తాయి, పోతాయి, ఉండాయి, తింటాయి.
వస్తాది, పోతాది, ఉండాది, తింటాది.
చేశాడు. వేశాడు. తీశాడు.

| గ్రామ్యము. | | సలక్షణము. |
|---|---|---|
| వస్తాయి, వస్తాది | ... | వచ్చుచున్నది |
| పోతాయి, పోతాది | ... | పోవుచున్నది |
| ఉండాయి, ఉండాది | ... | ఉంటున్నది |
| తింటాయి, తింటాది | ... | తినుచున్నది |
| చేశాడు | ... | చేసినాఁడు |
| వేశాడు | ... | వేసినాఁడు |
| తీశాడు | ... | తీసినాఁడు |

**6.** అచ్చులు తమంతటనే యుచ్చరింపఁబడునవి. (అ, ఆ మొదలయినవి) వీనికి స్వరములనియు పేరు.

**7.** హల్లులు అచ్చుయొక్క సాహాయ్యముచేత నుచ్చరింపఁబడునవి. (క, చ, ట, త, ప, మొదలయినవి.) వీనికి వ్యంజనములనియు పేరు.

**8.** మాత్ర ఒక రెప్పపాటు కాలమున నుచ్చరింపఁబడునట్టి యక్షరముయొక్క కాలప్రమాణము.

**9.** హ్రస్వము ఒకమాత్ర కలిగిది.

**10.** దీర్ఘము రెండుమాత్రలు కలిగినది.

**11.** ప్లుతము మూఁడు మాత్రలు కలిగినది.

**12.** వర్ణము అచ్చులకును హల్లులకును సామాన్య నామము.

**13.** కారము ఋకారేతరవర్ణంబునకు స్వార్థమునందు వచ్చు ప్రత్యయంబు. (ఉ. అకారము, కకారము, ఇత్యాదులు.)

**14** అక్షరము అచ్చునకును అచ్చుతోఁగూడిన హల్లునకును పేరు.

**15** అత్తు, ఇత్తు, ఉత్తు, క్రమముగా అకారమునకును, ఇకారమునకును, ఉకారమునకును సంజ్ఞ.

**16.** కంఠ్యము కంఠమువలన నుచ్చరింపఁబడునది.

**17.** తాలవ్యము దవడవలన నుచ్చరింపఁబడునది. (తాలువు-దవడ)

**18.** మూర్ధన్యము నోటిలోని పైభాగమువలన నుచ్చరింపఁబడునది (మూర్ధన్ - నోటిలోని పైభాగము)

**19.** దంత్యము దంతములవలన నుచ్చరింపఁబడునది.

**20.** ఓష్ఠ్యము ఓష్ఠములవలన నుచ్చరింపఁబడునది. (ఓష్ఠము - పెదవి.)

**21.** స్పర్శము దృఢమయిన స్పర్శము కలది.

**22.** అంతస్థము మధ్యముగా నుండునది.

**23.** ఊష్మము శ్వాసముతో నుచ్చరింపఁబడునది.

**24.** అనుస్వారము ఒక వర్ణముతోఁ జేర్చి యుచ్చరింపఁ బడినది. ఉ. ం ఁ.

**25.** విసర్గము విడువబడునది. ఉః.

**26.** లోపము ఉండినది లేకపోవుట.

**27** ఆదేశము ఉన్న దాని స్థానమున వేఱొకటివచ్చుట.

**28.** ఆగమము లేనిది వచ్చుట

**29.** ప్రత్యయము పదాంతావయవములయిన అందు, ఉండు మొదలయినవి.

**30.** బహుళము తఱుచు.

**31.** విభాష, వికల్పము విధి ప్రవృత్తి కలిగియు లేకయు ఉండుట.

**32.** ఉపధ అంత్యవర్ణమునకు పూర్వమయినవర్ణము.

**33.** ప్రాతిపదికము ప్రథమాప్రత్యయములు చేరుటకు మునుపు ఉండు నామరూపము.

**34** విభక్తి ప్రాతిపదికము ద్వితీయాదివిభక్తులు చేరుటకు మునుపు ఉండు నామరూపము.

**35.** అంతప్రత్యయము ద్రవిడపదములు తెనుంగునకు వచ్చునపుడు అంతమునందు అర్థవిశేషము లేక, చేర్పఁబడెడు, అ-ఇ-ఉ మొదలయిన ప్రత్యయములు. ఉ.

| తె. | | | అ. |
|---|---|---|---|
| సార | ... | ... | సార్ |
| కాయ | ... | ... | కాయ్ |
| వాయి | ... | ... | వాయ్ |
| చేయి | ... | ... | కై |
| నేయి | ... | ... | నెయ్ |
| కాలు | ... | ... | కాల్ |
| తోలు | ... | ... | తోల్ |
| ఏలు | ... | ... | అళ్ |
| మిన్ను | ... | ... | విణ్ |
| మన్ను | ... | ... | మణ్ |
| మను | ... | ... | వాల్ |



# క్రియా ప్రకరణము.

---

**36**. క్రియలకు పురుష లింగ వచనములు గలవు.

**37** పురుషములు మూఁడు, ఉత్తమపురుషము, మధ్యమపురుషము, ప్రథమపురుషము అని.

**38**, నేను, మేము, ఏను, నేము, మనము, ఇవి కర్తగా గలిగిన క్రియ ఉత్తమపురుషము. నీవు, ఈవు, మీరు, మీరలు, ఇవి కర్తగాఁ గలిగిన క్రియ మధ్యమ పురుషము. అన్ని నామములును, ఎవఁడు మొదలగు సర్వనామములును కర్తగాఁ గలిగిన క్రియ ప్రథమపురుషము.

ఈ పురుషములను ప్రత్యయములచేతను, అర్థములచేతను తెలిసికొనవలయును. ఉ. నేను చేయుదును. ఈ క్రియలో 'ఉను' ప్రత్యయము ఉత్తమ పురుషమును చూపును. నీకు శుభంబు అగును. 'అగును' అను క్రియలో ప్రథమపురుషవాచకమగు ప్రత్యయంబు లేదు. దానికిఁ గర్తయయిన 'శుభంబు' అను పదమువలన నది ప్రథమపురుషంబని తెలిసికొనవలయును.

లింగవచనములను గుఱించి చెప్పవలసిన సూత్రంబులను 'నామప్రకరణమునఁ' జూడుఁడు.

**39**. పురుష ప్రత్యయములు.

## (౧) పుంలింగ ప్రత్యయములు.

### ఏకవచనము.

* అండు, అఁడు, ఉండు, ఉఁడు.

ద్రవిడ ప్రత్యయము 'అన్' పుంలింగైకవచనము. దానికి 'ఉ' అను అంత ప్రత్యయమును చేర్పఁగా, 'అన్+ఉ' అని నిలుచును. ఈ రెంటికిని నడుమ 'డ'కారమును, 'న'కారమునకు బింద్వాదేశమును, అంతో కారమును పట్టి అన్ ప్రత్యయముయొక్క 'అ'కారమునకు పాక్షికముగా 'ఉ'కారాదేశమును రాఁగా, 'అండు ఉండు' అగును. పూర్ణబిందువునకు అర్ధానుస్వారము వైకల్పికముగ రాఁగా 'అఁడు ఉఁడు' అను ప్రత్యయములును సిద్ధించును.

---

* అ. అన్. ఈ ప్రత్యయము అండు మొదలయిన నాలుగు ప్రత్యయములకు మూలము. ఇవి అరవమునందుండి తెనుఁగునకు వచ్చిన కొన్ని నామంబులందుచూపవచ్చును. జీయంగారు = జీయన్+గారు. గారు పుంలింగబహువచనప్రత్యయము. నాయనింగారు = నాయన్+గారు (అ. నాయన్+గళ్), నాయన్ శబ్దమునకు వెనుక ఇకారాగమము రాఁగా, నాయనిగారు అని నిలిచినది. గారు ప్రత్యయముయొక్క గకారమునకు పూర్వముగ అనుస్వారాగమము రాఁగా, నాయనింగారు అని సిద్ధించెను. ఇట్లె అయ్యంగారు అను శబ్దమునందును అన్ ప్రత్యయము గలదు అయ్యంగారు = అయ్యన్+గారు. ఈ తెనుఁగు పదము అరవమునందు లౌకిక ప్రవృత్తి గలిగిన వైష్ణవులకు బిరుదయ్యె. ఈ శబ్దమువలె అమ్మంగార్, అప్పంగార్, అత్తంగార్, అణ్ణంగార్, అనుపదంబులు అరవమునందు కల్పింపఁబడినవి.

దాసర్ అను పదము దాసరి అని వికృతమయినట్లు, దాసన్ అను పదము దాసని అని వికృతమయ్యె. దాసనివాఁడు అనఁగా దాసుఁడయిన వాఁడు అనియర్థము. దాసానిపువ్వు అవగా దాసుఁడు దేవాలయమునకుఁ జేరిన తోఁటలో భగవత్పూజకుఁగాను పైరు చేసిన పువ్వు. దాసనివాఁడు

ఉ. గండండు ... గండాఁడు
మిండండు ... మిండాఁడు
రాముండు ... రామాఁడు
కృష్ణుండు ... కృష్ణాఁడు.

వాఁడు:—అను సర్వనామము ప్రత్యయముగా వచ్చును.

ఉ. చేసినవాఁడు ... వచ్చినవాఁడు.

ఆఁడు: —వకారమునకు లోపము రాఁగా, 'వాఁడు ఆఁడు' అగును.

ఉ. చేసినాఁడు ... వచ్చినాఁడు.

---

తనజీవనమునకై కుంకుమము, గంధపుపొడి, పల్లుపొడి, మొదలయినవానిం జేసి అంగడియందమ్మును. అట్లు చేయఁబడిన పల్లుపొడికి దాసనిపొడి దాసనాపొడి యని పేరువచ్చెను. ఈ దాసని అను పదమె సాతని అని వికృతమయి భగవద్భక్తులయి భగవత్కైంకర్యమును చేసెడు బ్రాహ్మణేతరులకుఁ జేరెను. పురాణములందు బ్రాహ్మణేతరులయిన భగవద్భక్తులకు తఱచుగా దాసశబ్ద మాపయోగింపఁబడును. పూర్వము తొండమాన్ చక్రవర్తికిఁ బుట్టలో నావిర్భవించియుండిన తిరుపతి వేంకటరమణస్వామి పూజఁ గావించుటకు రంగదాసుఁడు అనే శూద్రుఁడు తోడాయెను.

"దాసనామ్నా చ శూద్రేణ సహ త్వం పూజయ ప్రభుం।
త్వదాగమనకాలే తు పాండ్యదేశాత్సుధీశ్శుధిః॥
రంగదాస ఇతి ఖ్యాత శ్శూద్రస్త్వాం సంగమిష్యతి॥"
"పుష్పోద్యాన కరశ్శూద్రః॥"

బ్రహ్మాండపురాణము, వేంకటాచలమాహాత్మ్యము.

వాస్తవ వ్యుత్పత్తి యిట్లుండఁగా సాతని అను పదంబును సాత్తు అను ద్రవిడధాతువుయొక్క వ్యతిరేకనామ విశేషణరూపముగాఁ దలఁచి, సాతని వాఁడు అను పదమునకు యజ్ఞోపవీతము మొదలయిన కర్మచిహ్నముల ధరిం

కాఁడు:—'వాఁడు' ప్రత్యయము 'వ'కారమునకు 'క'కారాదేశమువచ్చుట చేత 'కాఁడు' అగును.

గాఁడు:—'వ'కారము 'గ'కారమగుటచే 'వాఁడు, గాఁడు' అగును.

ఈఁడు:—'ఇ' ప్రత్యయము 'అఁడు' ప్రత్యయముతోఁ జేరి 'ఇయాఁడు' అగును. 'ఇయాఁడు' వలన 'ఈఁడు' వచ్చినది.

కల్లరి+అఁడు = కల్లరియాఁడు = కల్లరీఁడు

మొక్కలి+అఁడు = మొక్కలియాఁడు = మొక్కలీఁడు

అటమటి+అఁడు = అటమటియాఁడు = అటమటీఁడు.

ఁడు:—ఱేఁడు, అ. ఇఱైవన్.

ఇఱ్ఱి+అఁడు = ఇఱ్ఱియాఁడు = ఱేఁడు.

ఎకిమీఁడు—'యజమానుఁడు.'

రాఁడు, అ. వారాన్, తె. వ్రాఁడు=రాఁడు, వకారలోపము.

లేఁడు, అ. ఇలన్ = తె. ఇలఁడు=లేఁడు.

కాఁడు, అ. ఆగాన్ = తె. అగఁడు=కాఁడు,

పోఁడు=పోవఁడు.

కఁడు:—ఒక్కఁడు, అ. ఒరువన్ + ఉ = ఒర్వఁడు = ఒవ్వఁడు = ఒక్కఁడు.

'ఉ'కారలోపము, రేఫవకారములకు వకారద్వయాదేశము, వకారద్వయమునకు కకారద్వయాదేశము.

---

పనివాఁడు అని అర్థమును ఈకాలములోఁ జేయుదురు. దానికిఁ బ్రమాణముగా విష్ణుచిత్తీయమునందును

"వెరుగు పడియుంబులును బచ్చిపరుగులాలుపుఁ
బప్పుమధుసూదనార్పణ కరణపేటి
కలును జానిన చాతని కులమువలసి" అని చెప్పఁబడియున్నది.

ఈవ్యుత్పత్తి కల్పితము. ఈవిషయమును సవిస్తరముగా వేఱుచోటఁ జెప్పెదను.

## (౭) స్త్రీలింగ ప్రత్యయములు.

### ఏకవచనము.

అది: —'ఇ' ప్రత్యయము చేరఁగా 'అవన్' అను సర్వనామప్రత్యయము 'అది' అగును. దీనికి దృష్టాంతము.

ఉ. కుశవన్ - కుశతి.

ముదవన్ - ముదతి.

కుశవన్+ఇ; అన్ లోపము,

కుశవ్+ఇ = కుశవి - కుశతి, వకారమునకు తకారాదేశము.

అట్లె అవన్+ఇ = అవి = అది, వకారమునకు దకారాదేశము. అది అనుసర్వనామము ప్రత్యయమయినది

ది: —'అది'యొక్క అకారమునకు లోపము. చిన్నది, పెద్దది.

దు: —ఇది నపుంసకప్రత్యయము, ప్రయోగముచే స్త్రీలింగమునకు సిద్ధించినది.

'అదు' అను నపుంసకైకవచనప్రత్యయము 'ఉ'కారంబునకు 'ఇ'కారాదేశంబగుటచే 'అది'యయినది. ఈ 'అది' ప్రత్యయమును పైఁజెప్పిన 'అది' ప్రత్యయమును ఏకస్వరూపములయినప్పటికిని భిన్నప్రత్యయములని తలఁపవలయును.

టి: —పూవును పోలినది = పూఁబోనిది = పూఁబోఁడి, 'లి' లోపము, నకారముతోఁ జేరిన ఇత్తునకు లోపము, 'న'కారమునకు 'డ'త్వము; బోఁటి, 'డ'కారమునకు 'ట'త్వము.

తి: —ఉ. ఒరుత్తి = ఒరువన్+ఇ = ఒరువి = ఒరుత్తి, 'వ'కారమునకు 'త'కారాదేశము, ఈపదము తెలుఁగునందు 'ఓర్తి' అని ఆయినది.

తె: —'తి' ప్రత్యయముయొక్క ఇకారము ఎత్వమును బొందఁగా 'తె' ప్రత్యయము సిద్ధించినది. ఉ. ఎవతె.

కటి: —ఒరువది = ఒవ్వది=ఒక్కటి, రేఫవకారములకు 'వ'కారద్వయము 'వ'కారద్వయమునకు 'క'కారద్వయమును ఆదేశముగా వచ్చినవి. దకారమునకు టత్వము.

కతి: —ఒరువది=ఒక్కటి, ఒక్కతి.

కతె: —ఒకతె, 'కతి' ప్రత్యయముయొక్క 'తి'కారమునకు 'తె' ఆదేశమయివచ్చెను.

అ: —ఆకారాంత స్త్రీలింగపదములు సంస్కృతమునుండి తెనుఁగునకు రాఁగా. అంతమునందుండు ఆకారమునకు హ్రస్వమగును. రమ, లత, వనిత.

## (3) పుంస్త్రీలింగ ప్రత్యయములు

### బహువచనము.

అరు: —వారు = అవరు = అ + అరు, అకారము పరామర్శార్థక విశేషణము, దీనికిని అరు ప్రత్యయమునకును నడుమ వకారము * వర్ణప్లుతిచేత 'అవరు వారు' అయెను.

రు: —తారు=తమరు; లేరు, అ. ఇలర్ = ఇలరు = లేరు; కారు, అ. ఆగార్=అగరు = కారు; మీరు, ఇమ్+అరు = ఇమరు = మీరు.

వరు: —అ. ఇవరు=ఇ+వరు=వీరు, ఎవరు=అ. ఎవర్=ఎ+వర్.

కరు: —అ. ఒరువర్=ఒర్వరు=ఒక్కరు, ఒకరు.

కురు: —అ. పలవర్ = పలుగురు, వెల్కురు, పెక్కురు. అకారమునకు ఎత్వము, లకార గకారములకు కద్వయాదేశము.

---

* వర్ణప్లుతి అనఁగా ఒక అక్షరము తానుండుచోటునుండి వేఱొకచోట దుమికి అచ్చటనుండు వర్ణమునకు ఆదేశముగా వచ్చుట, దీనిని 'అక్షర ప్రకరణమునందుఁ జూడుము.

అంత ప్రత్యయోకారమును బట్టి ప్రత్యయాదియయిన అత్తున కుత్వము.

గురు: —పలుగురు=అ. పలవర్, పలువురు. వకారమునకు గత్వము, ఇరు గురు, మూగురు, నలుగురు

దఱు: —అ. అన్నైవర్ = అన్నైవరు = అన్వరు = అందరు; ఐకార లోపము, వకారమునకు దత్వము, నకారమున కనుస్వారము. అందరు శబ్దమునకు లు ప్రత్యయము చేరఁగా, అందరు+లు = అందఱు, రేఫ లకారముల కత్వము, అందఱు, అ. అన్నైవర్, క. అనిబరు. ఇందఱు, అ. ఇన్నైవర్, క. ఇనిబరు. ఎందఱు, అ. ఎన్నైవర్, క. ఎనిబరు అ. ఇరువర్ =ఇర్వరు=ఇర్దరు=ఇద్దరు. అందఱువలె, ఇద్దఱు.

అలు: —వనితలు, అన్నలు, పెద్దలు, వారలు.

ఉలు: —రాములు, జనులు, మహాత్ములు, మునులు, ఋషులు. అలు ప్రత్యయోకారమును బట్టి ప్రత్యయాదియయిన అత్తునకు ఉత్వము. ఈ 'అలు, ఉలు' ప్రత్యయములయుత్పత్తిని 'విభక్తిప్రకరణము' నఁజూడుము.

లు: —శ్రీలు, స్త్రీలు.

పైఁజెప్పిన రు లు ప్రత్యయముల సంధిచేత 'ంద్రు, ర్లు, ఱు' అనియుం ఇంక పలువిధములుగాను వికృతిని జెందును. 'నామప్రకరణముఁ' జూడుము.

వారు: —సర్వనామము ప్రత్యయమాయెను. ఉ. చేసినవారు, చేయువారు.

గారు: —వారు ప్రత్యయముయొక్క వకారమునకు గాదేశము. ఉ. అయ్యంగారు, రాజుగారు, అ గళ్ ప్రత్యయము దీనికి సంబంధించినది.

## (౪) నపుంసకలింగ ప్రత్యయములు.

### ఏకవచనము.

అము: —అ. అమ్, సం. అమ్. అమ్+ఉ=అము.
ఉ. కులము, వనము, దేశము.

అంబు: —అ. అమ్+ఉ = అమ్+బ్+ఉ, బకారాగమము, మకారమునకు అనుస్వారాదేశము; ఉ. కులంబు, వనంబు, దేశంబు.

అమ్ము: —అంబు ప్రత్యయముయొక్క మబలకు మద్విత్వంబు.
ఉ. కులమ్ము, వనమ్ము, దేశమ్ము.

అదు: —తనదు, అ. తనదు. చేయదు.

అది: —అ. అమ=అది, ఉత్తునకిత్వము.

ఈ ప్రత్యయము స్త్రీలింగమునందు వచ్చు 'అది' అను ప్రత్యయముతోను ఏకరూప మగుచునప్పటికిని, ఆరెండు ప్రత్యయములను వేఱువేఱు అని గ్రహింప వలయును.

ది: —చిన్నది, పెద్దది, రానిది, పోనిది.

దు: —రాదు, అ. వారాదు, తె. వ్రాదు=రాదు, వకారలోపము.
పోదు = పోవదు.
లేదు, అ. ఇలదు = లేదు.
కాదు, అ. అగాదు = తె. అగదు = కాదు.
నాదు, అ. ఎనదు.
నీదు, అ. ఉనదు.
కద్దు = కలదు.
వద్దు = వలదు.

డు: —ఒండు, అ. ఒన్ఱు, క. ఒందు, ఒన్ఱుయొక్క ఱకారమునకు డత్వము.

కటి: —ఒరువది=ఒర్వది, ఒక్కటి. స్త్రీలింగైకవచనమునందు 'కటి' ప్రత్యయమును జూడుము.

టు: —అటు, ఇటు, ఎటు; అ. అట్టు, ఇట్టు, ఎట్టు.

అను: —అ. అన్+ఉ=అను; అరవమునందును, 'అమ్' ప్రత్యయముయొక్క 'మ'కారమునకు 'న'త్వము. కలను, అ. కలన్.
కొలను ,, కుళన్.
నెఱను ,, నిఱన్.

ను: —అ. మరన్=తె. మరను=మ్రాను.

అరవమునందు 'మరము' శబ్దముయొక్క తుది 'మ'కారమునకు నకారాదేశము రాఁగా 'మరన్' అను రూపము వచ్చెను. 'మరన్' శబ్దము అంత్యప్రత్యయమయిన 'ఉ'కారముతోఁ జేరి 'మ్రాను' అని సంక్షిప్తమయ్యె.

అంకు } అన్+కు=అంకు
అఁకు } అఁకు

కుళంగళ్ అను అరవశబ్దము 'ఉ' ప్రత్యయము చేరఁగా, కుళంగలు, కొలంకులు అని మారినది. ఇట్టి పదములందుండు 'కులు' ప్రత్యయమును తెలుఁగువారలు 'క్+ఉలు' అని విభజించి, 'ఉలు'వును మాత్రము బహువచన ప్రత్యయముగా గ్రహించిరి. అట్లుచేయుటచేత ప్రత్యయాదిభాగమయిన 'క'కారము పూర్వమయిన ఏకవచనప్రత్యయమగు 'అన్' అనుదానితోఁ జేర్పఁబడియె.

కలంకు, కలఁకు = కలన్+కు.
కెలంకు, కెలఁకు = కెలన్+కు.
కొలంకు, కొలఁకు = కొలన్+కు.
గవంకు, గవఁకు = గవన్+కు.

అరవములో 'శిఱిశు, పెరిశు, పుదిశు, ఏశు మొదలయినవి 'శిఱిదు, పెరిదు, పుదిదు, ఎళిదు' మొదలయినవానికి బదులుగా గ్రామ్యము నందు వచ్చును.

## బహువచనము.

అలు:— లతలు, గోడలు.

ఊలు:— తరువులు,

ధేనువులు. స్త్రీ పుంలింగ బహువచనప్రత్యయమును జూడుము.

కలు:— చిలుకలు, చిలి (అ. కిళి) + కలు (అ. గళ్)
ఎలుకలు, ఎలి (అ. ఎలి) + కలు (అ. గళ్)
ఎమ్ముకలు, ఎమ్ము (అ. ఎన్బు) + కలు (అ. గళ్)
అరవములో ఎలుంబు అనుపదము ఎన్బు అని సంక్షిప్తమయ్యె; ఎన్బు తెనుఁగునందు ఎమ్ము అయ్యె.

కులు:— కొలంకులు, కొలను (అ. కుళన్ ') + కులు (అ. గళ్)
కలంకులు, కలను (అ. కలన్) + కులు (అ. గళ్)

గులు:— ఏనుఁగులు, ఏన (అ. ఆనై) + గులు (అ. గళ్)
రేఁగులు, రేను, + గులు (అ. గళ్)
గొడుగులు, గొడ (అ. కుడై) + గులు (అ. గళ్)

గలు:— గానుఁగలు, గానము (అ. కాణమ్) + గలు (అ. గళ్)
వెలఁగలు, వెల (అ. విళ) + గలు (అ. గళ్)

అవి:— చేసినవి, చేయుచున్నవి.
వచ్చినవి, వచ్చుచున్నవి.

అవు:— చేయవు, కొట్టవు, తిట్టవు.

వు:— రావు, తేవు, తేరవు. కావు=అగవు=అగు+అవు. పోవు.

వి:— చేయనివి, కానివి, రానివి.

## (౫) ఉత్తమపురుష ప్రత్యయములు.

ఉత్తమ మధ్యమ పురుషంబులందు వచ్చెడు ప్రత్యయములన్నియు సర్వనామములయొక్క వికృతంబులు.

### ఏ క వ చ న ము.

ఆను: —చేసినాను = చేసిన+ఏను.

అను: —చేసెదను = చేయుంవ+ఏను.

వకారము భవిష్యత్కాలవాచకమగు ఆగమము; వకారమునకు దకారాదేశము.

ఉను: —చేయుదును = చేయుంవ+ఏను.

ఇని: —చేసితిని = చేసిన+ఏను.

ను: —లేను, ఇలను (అ. ఇల్లెన్.)

### బ హు వ చ న ము.

ఆము: —చేసినాము = చేసిన+ఏము.

అము: —చేసెదము } చేయుంవ+ఏము.
ఉము: —చేయుదము }

చేయుందుము, చేసెదము అనుపదములవలె వచ్చినవి.

ఇమి: —చేసితిమి = చేసిన+ఏము.

ము: —లేము = ఇలము (అ. ఇల్లేమ్.)

## (౬) మధ్యమపురుష ప్రత్యయములు.

### ఏ క వ చ న ము.

ఆవు: —చేసినావు = చేసిన+ఈవు.

అవు: —చేసెదవు } = చేయువ+ఈవు.
ఉవు: —చేయుదువు }

చేసెదను, చేయుదును అనుక్రియలను జూడుము.

ను: —చేసెదు = చేయుదువు. ఉవురొబ్బొ... వువర్ణమునకులోపము.
చేయుదు=చేయుదువు.

ఇవి: —చేసితివి = చేసిన+ఈవు

ఇ: —చేసితి = చేసిన+ఈవు.

వు: —లేవు=ఇలవు (అ. ఇల్లయ్.)
కావు=అగవు (అ. అగాయ్.)

బహువచనము.

ఆరు: —చేసినారు = చేసిన+ఈరు.

అరు: —చేసెదరు = చేయుచు+ఈరు.

ఉరు: —చేయుదురు = చేయు+ఈరు.

ఇరి: —చేసితిరి = చేసిన+ఈరు.

రు: —లేరు = ఇలరు (అ. ఇలర్)

ఈ ప్రత్యయములో కొన్ని క్రియలకును నామములకును సామాన్యముగానుండును. కొన్ని క్రియలకుమాత్రము కొన్ని నామములకుమాత్రము వచ్చును.

**40.** ఆఖ్యాతమును, క్రియ - ఈ రెండును ధాతువలనఁ బుట్టి వ్యాపారమును తెలుపునట్టి వచ్చుచున్నాఁడు, వచ్చి మొదలయిన పదములను దెలుపును.

ధాతువు చేత వ్యాపారమును బోధించి ప్రత్యయము మొదలయినవానిచే విభిన్నములయిన ఆఖ్యాతరూపములకన్నిటికిని సామాన్యమయిన అవయవము. దానివలనఁ గ్రియాపదములు ప్రత్యయాదులచేరికచే సాధింపఁబడును.

చేసెను, చేసిరి, చేయుచున్నాఁడు, చేసెడిని, చేసెదరు, చేయుదురు, చేఁత మొదలయిన క్రియలయందు చేయుసామాన్యభాగము అగుటచేత దానికి ధాతువు అని పేరు.

**41** ధాతువు సామాన్యముగా ఉకారముతోఁ జేరియే వచ్చుటఁబట్టి దానిని ఉకారాంతముగానే కోశములందు పఠియించినారు.

**42** అజంత హలంత ధాతువులకు ఈ ఉకారమును చేర్పఁగా అది లోపాగమ వకారాగమములఁ బొంది అనేక విధములయిన సంధివికారములతో మాఱియుండును. ఆపూర్వులచేత ననేక ధాతువుల నిజస్వరూపము లెఱుఁగఁబడకుండును.

ఉదాహరణములు.

| తె. | | అ. | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| కట్టు | ... | కట్టు. | ఆడు | ... | ఆడు. |
| పడు | ... | పడు. | పాడు | ... | పాడు. |
| ఇడు | ... | ఇడు. | వేఁడు | ... | వేణ్డు. |

ఈ ధాతువులు అరవమందును తెనుఁగునందును ఏకరూపములయినవి.

అ. వేణ్డుయొక్క ణకారము తెనుఁగునందు అర్ధానుస్వారముగ నున్నది.

| తె. | | అ. | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| కను | ... | కాణ్. | మూయు | ... | మూయ్. |
| తిను | ... | తిన్. | పాయు | ... | పాయ్. |
| మాను | ... | మాణ్. | వేయు | ... | వేయ్. |
| కోయు | ... | కొయ్. | మేయు | ... | మేయ్. |
| చేయు | ... | శెయ్ * | అరు | ... | అర్. |

* అరవపదముయొక్క ఆద్య శవర్ణమునకు తెనుగున చత్వము.

ఈ ధాతువులయందు హలంతములయిన అరవధాతువులు తుదియందు ఉ ప్రత్యయమును బొంది తెనుఁగునకు వచ్చియున్నవి. అ. కాణ్ యొక్క ణకారమునకు తెనుఁగున నత్వమును ఆకారమునకు హ్రస్వాదేశమును వచ్చినవి. కొయ్, కెయ్ ధాతువుల యొక్క స్వరమునకు దీర్ఘము.

| తె. | | అ. |
|---|---|---|
| వ్రాయు | ... | వరి |
| గ్రొయ్యు | ... | కులి |
| క్రయ్యు—'శబ్దించు' | | కరై 'రోదనముచేయు' 'పిలు' |
| వ్రయ్యు | ... | విరి 'బ్రద్దలగు'. |

ఈ ధాతువులలోను అరవధాతువుల తుదియందు ఉ ప్రత్యయమును చేర్చుటచేత తెనుఁగుధాతువులు పుట్టినవి. అరవధాతువుల మొదటి అచ్చులు వర్ణప్లుతి విధిచేత పరమయిన హల్లులకువెనుక దుమికి అచ్చుటనుండు అచ్చులకు ఆదేశములయినవి అట్లయినవెనుక వరిధాతువుయొక్క అకారము ఆకారముగను, కులిధాతువుయొక్క ఉకారము ఒకారముగను, విరిధాతువుయొక్క ఇకారము ఆకారముగను మాఱినవి.

| తె. | | అ. | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| తనియు | ... | తణి | కలయు | ... | కల |
| తెలియు | ... | తెరి | నలియు | ... | నలి |
| మడియు | ... | మడి | మలియు—'వ్యాపించు'. | ... | మలి — 'అధికమగు' |
| మొనయు | ... | మునై | పడయు | | పడై |
| కుదియు—'తగ్గు'. | | కుఱు—'పల్లమగు'. | పడియు | | పడి |
| కదియు—'సమానమగు' | | కది 'శ్రేష్ఠుఁడగు'. | | | |

వీనిలో అరవధాతువులకు తెనుఁగున ఉ ప్రత్యయముచేరఁగా ఆప్రత్యయమునకును ధాత్వంతమునందుండు అచ్చులకును నడుమ యకారము ఆగమముగ వచ్చియున్నది. తణియొక్క ణకారము నకారమయ్యె, తెరి యొక్క రేఫము లకారమయ్యె.

| తె. | | అ | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| అలుచు | ... | అలై | ముడుచు | ... | ముడి |
| తెలుచు | ... | తెలు | కుడుచు | ... | కుడి |
| వెలుచు | ... | విలు | విడుచు | ... | విడు |
| మొలచు | ... | ముళై | కడచు | ... | కడ |
| కలుచు | ... | కడి | నడచు | ... | నడ |
| తుడుచు | ... | తుడై | ఉలుచు | ... | ఉరి |
| మడుచు | ... | మడి | ఈడుచు | ... | ఇఱు |

వీనిలో అరవధాతువుయొక్క తుదియందు చు ప్రత్యయము చేర్పఁబడియె. చు ప్రత్యయోకారమునుబట్టి తుడుచు మొదలగునవి అయిను ధాతువులలో అరవ ధాత్వంతమునందు ఇకారైకారములకు వర్ణసమీకరణవిధిచే ఉత్వము. అలైయొక్క ఐకారమునకు అత్వము. ముళైయొక్క ఉకారమునకొత్వము, ళకారమునకు లత్వము. ఉరియొక్క రేఫమునకు లత్వము. ఇఱు వికృతిచేత ఈడు అయి చు ప్రత్యయమును బొందెను.

| తె. | | అ. | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| ఇచ్చు | ... | ఈ | తెచ్చు | ... | తా |
| నొచ్చు | ... | నో | పుచ్చు | ... | పెఱు |
| వచ్చు | ... | వా | పుచ్చు | ... | పుఱు |
| గ్రుచ్చు | ... | కో | విచ్చు | ... | విరి |

అరవధాతువులకు చు ప్రత్యయము చేర్పఁబడినది. చు ప్రత్యయమునకు పూర్వముగ ఈ, నో, వా, తా ధాతువుల అచ్చునకు హ్రస్వత్వము. కో

యొక్క తుదియందు రేఫాగమమువచ్చి కోర్ అని నిలువఁగా వర్ణవ్యత్యయము చేత క్రోర్ అనునది క్రో అయ్యె. చు ప్రత్యయముచేరఁగా, క్రో + చు అనునది క్రుచ్చు అని పరిణమించె. విరి, పెఱు ధాతువుల రేఫ ఱకార ములకు వానిచేర్చిన అచ్చులకును లోపము, చు ప్రత్యయ చకారమునకు ద్విత్వము. పులుయొక్క లకారమునకు రేఫము ఆదేశముగా వచ్చి చు ప్రత్యయముచేరఁగా, లోపించినది. చు ప్రత్యయ చకారమునకు ద్విత్వము.

| తె. | | అ. |
|---|---|---|
| మ్రింగు | ... | మిఱుంగు |
| బ్రుంగు | ... | ముఱుంగు |
| వంగు | ... | వణంగు, వళై. |

వీనిలో, మిఱుంగు ముఱుంగులయొక్క ఱకారమునకు రేఫత్వము. మిఱుంగుయొక్క మకారమునకు బత్వము, ఇకారమునకు లోపము. బ్రుంగు ధాతువునందు ముఱుంగు మకారమునకు బత్వము; ఉలోపము. వణంగు యొక్క ణకారమునకు లోపము.

| తె. | | అ. | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| కాఁగు | ... | కాయ్ | మాఁగు | ... | మాయ్ |
| చాఁగు, సాఁగు | ... | శాయ్ | తోఁగు | ... | తోయ్ |
| | | | మూఁగు | ... | మూయ్. |

వీనిలో అరవధాతువుల తుదియందు గుప్రత్యయము చేర్పఁబడెను. ధాత్వంత యకారమునకు లోపమును దాని స్థానమున అర్ధానుస్వారమును వచ్చినవి.

| తె. | | అ. | తె. | | అ. |
|---|---|---|---|---|---|
| ఎఱుంగు | ... | అఱి | నలుఁగు | ... | నలి |
| ఉడుగు | ... | ఒఴి | నుడుఁగు | ... | నుడి |
| విరుగు | ... | విరి | మఱుఁగు | ... | మఱై |

| | | | |
|---|---|---|---|
| కలుగు ... కిడై | మలఁగు ... మత్తై | | |
| చినుగు ... కిఱు | విడుగు-'వికసించు' ... విడి - 'సూర్యుఁడు ప్రకాశించుట.' | | |
| తిరుగు ... తిరి | | | |
| తోఁగు ... తుఱు | పొడుగు. 'మాయు' ... పొత్తై (పొడు చు). | | |
| దిగు, డిగు ... ఇఱు | | | |

ధాతువుల తుదిని 'గు' ప్రత్యయము చేర్పఁబడియె. తుఱు, ఇఱుతప్ప మిగిలిన ధాతువులయందంతయు నందుండు అచ్చులకు అకారమును ఉకారమును ఆదేశములయినవి. 'అఱి'యొక్క 'అ'కారమునకు 'ఎ'త్వము; 'ఒఱ' 'ధాతు ఱకారమునకు 'ద'త్వము. 'కిఱు'యొక్క 'క'కారమునకు 'చ'త్వము, 'ఱ'కారమునకు 'న'త్వము. 'ఇఱి'యొక్క 'ఱ'కారమునకు 'ద'త్వ 'డ'త్వములు రాఁగా, 'ఇఱి, ఇది-ఇడి' అయినది. 'ఇది - ఇడి' ఈ రెంటికిని 'గు' ప్రత్యయమును, 'ఇ'కారమునకు లో'పమును రాఁగా, 'దిగు, డిగు' అనుధాతువులు వచ్చినవి. 'ఇది'కి 'గు' ప్రత్యయము వచ్చి, ధాత్వంతేకారమునకు అకారమును గకారమునకు పూర్వమున అనుస్వారాగమమునురాఁగా 'ఇదంగు' అనురూపము వచ్చును, 'ద'కారమునకు రేఫ ఱకారాదేశమును ఇత్తున రెకారాదేశమును రాఁగా, 'ఎరంగు, ఎఱంగు' అను ధాతువులు తెనుఁగునందువచ్చినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉండు | ... | ఇరు. | పండు | ... | పఱు. |
| నిండు | ... | నిరవు. | పిండు | ... | పిఱి. |

'ఇరు'ధాతువుయొక్క 'ఇ'కారమునకు 'ఉ'త్వమును, రేఫమునకు 'న'త్వమును, దానికిపరంబుగ 'డ'కారాగమమును వచ్చినవి 'నిరవు'ధాతువు 'నిరు' అనురూపమునుబొంది, రేఫమునకు 'న'త్వమును 'న'కారమునకు పరంబుగ 'డ'కారాగమమునురాఁగా 'నిండు' అయినది. 'పఱు, పిఱి' ధాతువుల 'ఱ'కారమునకు 'ణ'త్వమును 'డ'కారాగమమును, 'పిఱి'యొక్క తుది 'ఇ'కారమునకు 'ఉ'త్వమునువచ్చినవి.

| తె. | | అ. | |
|---|---|---|---|
| కప్ప | ... | కరప్పు | భా. నా. మూయుంట. |
| గెట్టు | ... | కళవు | భా. నా. దొంగలించుట, |
| ప్రబ్బు | ... | పరవు | |
| ఓము | ... | ఓమ్పు | |
| నోము | ... | నోన్పు | భా. నా. నోముచేయుంట. |
| వెమ్ము | ... | వెమ్పు | |

'కరప్పు' శబ్దముయొక్క రేఫమునకును దానితోఁజేరిన 'అ'కారమునకును లోపము. 'కళవు'యొక్క 'ళ'కారమునకు లోపమును 'వ'కారమునకు 'బ'త్వమును ద్విత్వమునువచ్చినవి. 'పరవు' యొక్క మొదటి 'అ'కారమునకు లోపము 'వ'కారమునకు 'బ'త్వమును ద్విత్వమునువచ్చినవి. 'ఓమ్పు' యొక్క 'ప'కారమునకులోపము. 'నోన్పు'యొక్క 'నప'లకు 'మ'కారాదేశము. 'వెమ్పు'యొక్క 'ప'కారమునకు 'మ'త్వము.

4౮. సంస్కృతమునందలి [illegible] ధాతువులును, ధాతుభిన్నమై ధాతువుగా నుపయోగింపఁబడు శబ్దములును అంతమునందు ఇంచు అను ఆగమమును బొందును.

లఘువయిన 'ఇ, ఉ, ఋ, ౡ,' ఉపధగాఁ గలిగిన హలంతధాతువులకు 'ఇంచు' పరంబగునపుడు గుణము వచ్చును. ఇకారమునకు 'ఏ,' ఉకారమునకు 'ఓ' ఋకారమునకు 'అర్' గుణములు అనఁబడు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఉ. | ఛిద్ | ... | ఛేదించు | బుధ్ | ... | బోధించు |
| | భిద్ | ... | భేదించు | పుష్ | ... | పోషించు |
| | వృత్ | ... | వర్తించు | నృత్ | ... | నర్తించు |

4౯. అజంతములును ఏకాక్షరములు నయిన ధాతువులకు ఇంచు పరంబగునపుడు ఇ కారమునకు అయ్, ఉ కార

మునకు అవ్; ఋ కారమునకు అర్, అనునవి యాదేశంబు లగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉ. | క్షి ... | క్షయించు | వృ ... | వరించు |
| | జి ... | జయించు | హృ ... | హరించు |
| | ద్రు ... | ద్రవించు | భృ ... | భరించు |
| | స్రు ... | స్రవించు | ధృ ... | ధరించు |
| | భూ ... | భవించు | స్మృ ... | స్మరించు |

**50** క్రియలయొక్క అవయవములు మూఁడు. ధాతువు, కాలవాచకాగమము, ప్రత్యయము. వ్యతిరేక క్రియయందు అభావ వాచకాగమమును గలదు.

**51** కొన్ని క్రియలయందు ధాతుమాత్రముండును.

ఉ. కొట్టు - తిట్టు - ఎత్తు - తిను - విను - అను - రా, పో, తే, ఈ. తెనుఁగు ధాతువులన్నియుం ఉకారాంతములే. అంతమునందుండు ఆయుకారము ప్రత్యయమని వ్యవహరింపఁబడినను అది యుచ్చారణార్థమే చేర్పఁబడియుండుటచే దానికి అవయవత్వము లేదు.

**52** కొన్ని క్రియలయందు ధాతువు, ప్రత్యయము అను నీరెండు అవయవములే యుండును.

ఉ. తెమ్ము=తేరు+ము. ము మధ్యమపురుషైకవచనము.
కలను=కల +అను. అను ఉత్తమపురుషైకవచన ప్రత్యయము.
కలఁడు=కల+అఁడు అఁడు ప్రథమపురుషైకవచనప్రత్యయము.

**53**. కొన్ని క్రియలయందు ధాతువు కాలవాచకాగమము ప్రత్యయము ఈమూఁడు అవయవములును గలవు.

ఉ. చేయుదును=చేయు+ఉద+ఉను.

చేసితిని =చేయు+ఇత+ఇని.

**54** వ్యతిరేక క్రియలయందు కాలవాచకాగమము, ప్రత్యయము, ధాతువునకును ఆగమమునకును మధ్యమున అభావార్థకమగు అకారాగమమును గలవు.

ఉ. చేయనివాఁడు=చేయు+అ+ని+వాఁడు.

**55.** క్రియలు పూర్ణక్రియలనియు అపూర్ణక్రియలనియు ద్వివిధములు. వీనికే క్రమముగా సమాపకక్రియ అనియు, అసమాపకక్రియ అనియు, పేళ్లుగలవు. వాక్యమును పూర్తి చేయునది పూర్ణక్రియ; పూర్తిచేయనిది అపూర్ణక్రియ.

ఉ. రాజువచ్చెను. ఇక్కడవచ్చెను అనుదానితో వాక్యము పూర్ణము అగుచున్నది.

రాజువచ్చి నగరమునకుఁ బోయెను. ఇక్కడ వచ్చి అను పదముతో వాక్యము ముగియదు. పోయెను అను పదముతో ముగియుచున్నది.

**56.** పూర్ణక్రియలు నాలుగువిధములు.

(౧) వర్తమానార్థకము.

(౨) భూతార్థకము.

(౩) భవిష్యదర్థకము.

(౪) ప్రార్థనాద్యర్థకము.

**57.** ఆరంభింపబడి ముగియని కార్యమును తెలుపునది వర్తమానార్థకము.

**58** సమాప్తమయిన కార్యమును తెలుపునది భూతార్థకము.

**59.** రాఁగల కార్యమును దెలుపునది భవిష్యదర్థకము.

**60.** ప్రార్థన, ఆజ్ఞ, విధి, ఆశీస్సు (శుభేచ్ఛ) ఈ అర్థములు గలిగినది ప్రార్థనాద్యర్థకము.

ఉ. రమ్ము. పోవుదము, వచ్చునది, పోవుతన్. కాతన్.

ఈరూపములలో నొక్కొక్కదానికి పైఁజెప్పిన అర్థములు ప్రయోగానుసారముగ సంభవించుటచేత ఆయర్థముల నన్నిటిం జేర్చి ఆక్రియలకు ప్రార్థనాద్యర్థకమని సంజ్ఞ చెప్పఁబడెను.

భూతార్థకము రెండువిధములు;

ఉ. (1) వచ్చినాఁడు, వచ్చినది, వచ్చినారు, మొదలయినవి.

(2) వచ్చెన్, వచ్చిరి, వచ్చితివి, మొదలయినవి.

**61** భవిష్యదర్థక పూర్ణ క్రియలలో రెండువిధములు గలవు.

(౧) శుద్ధము—ఉ. చేసెదము, చేయుదుము, వచ్చెదము, వత్తుము.

(౨) సమస్తము—రెండు పదములుచేరి భవిష్యదర్థమును ఇచ్చునట్టి రూపము.

ఉ. చేయఁగలను, రాఁగలను, పోఁగలను. ఇచ్చట చేయన్, రాన్, పోన్, అనుపదంబులు భావనామంబులు. అవి కలను అను క్రియయొక్క ధాత్వర్థమయిన కలిగియుండుట అను కార్యమునకు కర్తృపదంబులు. కలను 'కలిగినవాఁడను' చేయన్ 'చేయుట'; 'చేయుట యను క్రియ నాయందు గలిగి

యున్నది' అనియర్థము. ఆయర్థముచేత నేను ఇంకను చేయుచున్నాను అనెడి తాత్పర్యము సిద్ధించుచున్నది. ఈతాత్పర్యమే చేయఁగలను అనెడు సమస్తక్రియకు అర్థము.

ఇట్లే రాఁగలను, పోఁగలను, అను సమస్త క్రియలకు వత్తును, పోదును అని అర్థము సిద్ధించుచున్నది.

ఈ క్రియల స్వరూపమిట్లుండఁగా చేయఁగలను అను దానిని ముఖ్య భవిష్యదర్థకమయిన క్రియగా గ్రహించి శుద్ధ భవిష్యద్రూపమయిన చేయుదును, చేసెదను, అను క్రియారూపములకు తద్ధర్మార్థకమని పేరు పెట్టుట యుక్తముకాదు. దానిచేత క్రియా స్వరూపము తెలియక మఱుఁగి యుండును.

**62**. వర్తమానార్థకము మొదలయిన మూఁడురూపములను పదవ్యుత్పత్తినిబట్టి సమస్తపదములుగా గ్రహింపవలయు వానిలో పూర్వపదములు ధాతుజన్యనామ విశేషణములు. ఉత్తరపదములు సర్వనామములు.

వర్తమానార్థకము.

ఉ. ప్ర. వచ్చుచున్నాఁడు = వచ్చుచున్న + వాఁడు పు. ఏ.
వచ్చుచున్నది = వచ్చుచున్న + అది. స్త్రీ. ఏ.
వచ్చుచున్నారు = వచ్చుచున్న + వారు. స్త్రీ. పు. బ
వచ్చుచున్నది = వచ్చుచున్న + అది న. ఏ.
వచ్చుచున్నవి = వచ్చుచున్న + అవి. న. బ.
మ. వచ్చుచున్నావు = వచ్చుచున్న + ఈవు.
,, వచ్చుచున్నారు = వచ్చుచున్న + ఈరు.
ఉ. వచ్చుచున్నాను = వచ్చుచున్న + ఏను.
,, వచ్చుచున్నాము = వచ్చుచున్న + ఏము.

**63.** భూత. (1) వచ్చినాఁడు } వచ్చిన+వాఁడు.
వచ్చినవాఁడు

తక్కినవి పైఁజెప్పినట్లు ఊహించుకోవలయును.

(2) వచ్చెన్ అనునది సంశ్లిష్టరూపము. వచ్చినది, వచ్చినవి, వచ్చినాఁడు, ఈమూఁటికిని సామాన్యరూపము.

వచ్చితివి=వచ్చిన+ఈవు. వచ్చితిని=వచ్చిన+ఏను.

వచ్చితిరి=వచ్చిన+ఈరు. వచ్చితిమి=వచ్చిన+ఏము.

తకారము భవిష్యత్కాలవాచకము; అది సత్వమునుబొంది కొన్ని రూపంబులందు వచ్చును. తకార నకారములకు పూర్వమున ఇకారము ఆగమము.

**64.** భవిష్య. (1) వచ్చును. } భూతంబులందు వచ్చినాఁడు,
వచ్చెడిని. } వచ్చినది, వచ్చినవి అనునవి
వచ్చెడును. }

వచ్చెన్ అనిసంశ్లిష్టమయినట్లు భవిష్యత్తునందు వచ్చువాఁడు, వచ్చునది, వచ్చునవి అను మూఁడురూపములును సంశ్లిష్టమగుటచే వచ్చున్ అనునది సిద్ధించునది. వచ్చును అనునది వచ్చెడిని వచ్చెడును అని అగుటను భవిష్యత్ప్రకరణమునఁ జూడుము.

వచ్చెదరు, వచ్చుదురు=వచ్చువ*+వారు.

వచ్చుదువు } వచ్చువ+ఈవు.
వచ్చెదవు

వచ్చుదురు } వచ్చువ+ఈరు.
వచ్చెదరు

వచ్చుదును } వచ్చువ+ఏను.
వచ్చెదను

---

*వచ్చువ భవిష్యదర్థక ధాతుజన్యనామ విశేషణము ఇది వచ్చున్, వచ్చెడు, వచ్చెడి అనువానికి ప్రాచీనరూపము.

వచ్చుదుము } వచ్చువ+ఏము
వచ్చెదము }

**65** సమస్త భవిష్యద్రూపములలో ఆఖ్యాత భాగము కలఁడు మొదలయినవి. పూర్వపదము క్రియానామము. కాఁబట్టి ఆ యాఖ్యాతభాగమునకె విగ్రహము చెప్పవలయును.

కలఁడు = కల + వాఁడు. ప్ర-పు.
కలది = కల + అది. ,,
కలరు = కల + వారు ,,
కలవి = కల + అవి. ,,
కలవు = కల + ఈవు. మ-పు.
కలరు = కల + ఈరు. ,,
కలను = కల + ఏను. ఉ-పు.
కలము = కల + ఏము. ,,

**66** ఇట్లు క్రియారూపములు పూర్వము కర్మధారయ సమాసముగానుండి వెనుక అక్షర లోపములతో సంక్షిప్తమగుటచేత వానికి ఏకపదత్వ న్యవహారము సంభవించెను. పూర్ణరూపములయందు సర్వనామంబులుగ నుండిన ఉత్తరపదములు సంక్షిప్త రూపమునందు ప్రత్యయంబులుగా గ్రహింపఁబడినవి. సర్వనామమునకు ప్రాధాన్యము నిచ్చినయెడ వాక్యమందు పునరుక్తి దోషము గలదు. అది యెట్లనిన:

ఏనువచ్చితిని=ఏను వచ్చిన ఏను. ఇచ్చట ఏను అను సర్వనామము వాక్యంబునందు ద్విరుక్తమయ్యె. వచ్చిన+ఏను అను పద ద్వయంబును వచ్చితిని అని సంక్షేపింపఁగా, కడపటనుండు ఇని అనుదానిని ప్రత్యయముగా గ్రహించుటచే నాదోషంబు పరిహృతంబగును.

పైఁజెప్పినట్లు సంక్షిప్తమయిన కాలవాచక క్రియారూపములందు పూర్వపదంబులయిన ధాతుజన్యనామ విశేషణంబుల యంత్యాచ్చులును కాల వాచకమయిన ఆగమముగా గ్రహింపవలయును.

## త్రికాల రూపము.

**67**. వర్తమానంబునందు ధాతు ప్రత్యయంబులకు మధ్యమున చున్నాగమముండును.

ఉ. వచ్చుచున్నవాఁడు<br>వచ్చుచున్నాఁడు } = వచ్చు+చున్న+వాఁడు.

వాఁడు ప్రత్యయముయొక్క వకారము వైకల్పికముగా లోపింప వచ్చిన వాఁడు వచ్చినాఁడను రెండురూపములువచ్చినవి. అట్లె బహువచనములో వచ్చినవారు వచ్చినారు అని రెండురూపములు గలవు.

ప్రాచీన వర్తమాన రూపములయిన 'చేస్తాఁడు, వస్తాఁడు, తెస్తాఁడు, పోతాఁడు' అనునవి నన్నయభట్టారకులు మొదలయినవారి కాలముననే గ్రామ్యములని ఎన్నఁబడి సత్కవులచే గ్రహింపఁబడనివయ్యె. అయినను అవియె శుద్ధమయిన వర్తమానరూపములని వానికి సమానములయిన కర్ణాటక ద్రవిడ మలయాళ క్రియారూపములతోఁ బోల్చినఁ దెలియవచ్చును.

ఉ.

| తెనుఁగు. | కన్నడము. | ప్రా. ద్రవిడము. |
|---|---|---|
| చేస్తాఁడు<br>చేయుంతాఁడు | గెయ్యుత్తానె. | శెయ్యునన్. |
| వచ్చుతాఁడు<br>వస్తాఁడు | బరుత్తానె. | వరునన్. |
| తెస్తాఁడు<br>తెచ్చుతాఁడు | తరుత్తానె. | తరునన్. |

పోవుతాఁడు } పోఁగుత్తాను. పోఁగున్నన్.
పోతాఁడు

ప్రా. మలయాళము.

చేయ్యున్నాన్. తరున్నాన్.
వరున్నాన్. పోఁగున్నాన్.

అరవమునందు శెయ్యున్రాన్ అనురూపము తొల్కాప్యమను ప్రాచీన వ్యాకరణమందును ప్రాచీన కావ్యములందును వచ్చును. వెనుకటి భాషలో శెయ్‌గిన్నాన్ శెయ్‌కిన్రాన్ అని వికృతమగు విశేషముగాఁ బ్రయోగింపఁబడును. ఈరూపమునుబట్టి తెనుఁగునందు చేయుచున్నాఁడు అనురూపము సిద్ధించి వర్తమానకాలమున గ్రంథములందును సామాన్య వ్యవహారమునందును ఉపయోగింపఁబడుచున్నది.

తె. చేయుచున్నాఁడు=చేయు+చున్న+వాఁడు.

అ. శెయ్‌గిన్రాన్=శెయ్+గిన్ర+అవన్.

**68.** చేస్తాఁడు మొదలయినవి కవిప్రయోగమునందు లేకపోయినను సాధారణవ్యవహారములో తఱచుగా ఉపయోగింపఁబడుటచే వానికి లక్షణము చెప్పుట యావశ్యకము.

గ్రామ్యమని సత్కవులచే విడువఁబడిన ఈప్రాచీన క్రియలయందు, ఉత, త అనునవి వర్తమానకాలవాచకాగమములు.

ఉ. చేస్తాఁడు, నేస్తాఁడు.
కొట్టుతాఁడు, తిట్టుతాఁడు.

శెయ్దు, వరుది, తరుది, పోది అను వర్తమానార్థకరూపములు మధ్యమపురుషైకవచనమందు అరవకావ్యములోఁ బ్రయుక్తములయియున్నవి. వాని

యందువచ్చు దకారము పైఁజెప్పిన వర్తమానకాలవాచకాగమముయొక్క తకారముతో సంబంధించియున్నది.

ఈరూపములను చూస్నా సంబంధములయిన రూపములవలె సమస్త పదములు.

**69.** ధాత్వంతయకారమునకు అవాది ప్రత్యయము పరమగునపుడు లోపము.

చేయు + త = చేయుత.

చేయు + ఇ = చేసి.

చేయు + ఇక = చేయక. [నకు సత్వము.

ఉ. చేస్తాడు=చేయుత+వాడు. పైగల సూత్రముచే యకారము

చేస్తాది = చేయుత+అది.

చేస్తారు = చేయుంత+వారు.

చేస్తాది = చేయుత+అది.

చేస్తావి = చేయుంత+అవి.

చేస్తావు = చేయుత+ఈవు.

చేస్తారు = చేయుంత+ఈరు.

చేస్తాను = చేయుంత+ఏను.

చేస్తాము= చేయుంత+ఏము.

కొట్టుతాడు = కొట్టుత+వాడు.

తిట్టుతాడు = తిట్టుత +వాడు.

ఇట్లే కొట్టుతాది తిట్టుతాది మొదలయినవి యూహ్యంబులు.

**70.** ఉకారాంత చకారాంత ధాతువులకు పరంబుగ ఉతాగమముయొక్క ఉకారమునకు లోపము రాగా ధాత్వంత చయలకు సత్వము.

౭౫-వ విధిచేత ధాత్వంతమునందుండు ఉకారమునకు లోపము.

ఉ. చేయుంత = చేయ్ + త = చేస్త; చేస్తాడు,
సేయుంత = సేయ్ + త = సేస్త; సేస్తాడు.
పలుచుత = పలుచ్ + త = పలస్త; పలస్తాడు.
వచ్చుత = వచ్చ్ + త = వస్త; వస్తాడు.
తెచ్చుత = తెచ్చ్ + త = తెస్త; తెస్తాడు.
ఈడుచుత = ఈడుచ్ + త = ఈడుస్త; ఈడుస్తాడు.

**71** ఉండుధాతువు నకారమునకు లోపము

ఉ. ఉండుత=ఉండ్+త = ఉన్త = ఉంట. తకారమునకు టత్వము. ఉంటాడు ఉంటారు ఉంటాది మొదలయిన గ్రామ్యరూపక్రియలు ఇట్లు వచ్చును. తకారమునకు నత్వము వచ్చినయెడల ఉన్నాడు, ఉన్నారు, ఉన్నది మొదలయిన రూపములు వచ్చును.

**72**. నకారాంత ధాతువులకు సహజముగ తకారమునకు టత్వము.

ఉ. అనుత = అన్ + త = అంట; అంటారు.
తినుత = తిన్ + త = తింట; తింటారు.

ఇట్లు కొంటారు వింటారు మొదలయినవి ఊహ్యంబులు.

**73**. అంటారు అను క్రియ అంట అంటయని రూపభేదమును బొంది "ఇట్లు జనులు చెప్పుచున్నారు" అను నర్థమునందు ప్రయోగింపఁబడుచున్నది.

"తామఁటతలఁపఁగఁదలఁట యేమఁటపాదుకలమఁట" భాగ. ౧౦.

ఇది గ్రామ్యభాషలో అటయని మాఱును.

74. ఈగ్రామ్యరూపంబునందు అదిప్రత్యయము అయి అగును.

ఉ. వస్తాది = వస్తాయి = వస్తయి.
పోతాది = పోతాయి = పోతయి.
తిట్టుతాది = తిట్టుతాయి = తిట్టుతయి.
కొట్టుతాది = కొట్టుతాయి = కొట్టుతయి.

ఇట్లే ఇరువది, ఇరువయి, ఇరువై, ముప్పది, ముప్పయి ముప్పై, అని గ్రామ్యమునందు వచ్చును. ఇట్లే ప్రాకృతమునందును హారతి, హారది, హారఇ, రంధధి రుంధఇ అనివచ్చును.

**75** భూతకాలము —భూతార్థకము లయిన క్రియల యందు ఇత, ఇన ఆగమములు అగును. ఈ ఆగమంబులు సంస్కృతంబునను గలవు.

ఉ. పఠిత = పఠ్ + ఇత ; చదువఁబడిన.
గదిత = గద్ + ఇత ; చెప్పఁబడిన.
జనిత = జన్ + ఇత : జనియించిన.

స్ఫుటిత = స్ఫుట్ + ఇత ; పగిలిన.

ఇచ్చట తకారము భూతార్థకమయినది, దానికి ఇకారము ఆగమము. ఈతకారమునకు నకారము ఆదేశమగు.

ఉ. త్రాణ = త్రాత = త్రా + త ; రక్షింపఁబడినది.
భగ్న = భక్త = భజ్ + త ; విఱువఁబడినది.
రుగ్ణ = రుక్త = రుజ్ + త ; రోగముగలిగినది.

ఇట్లే తెనుఁగునందును తకార నకారములు భూతార్థకములు. తకారమునకు నకారాదేశము.

**76.** ఉత్తమ మధ్యమ పురుషంబులందు ద్వితీయ భూతంబునకు ఇతాగమమును, ప్రథమ భూతంబునకు అన్ని పురుషంబులందును ఇనాగమము నగు.

ఉ. చేసినాఁడు = చేసినారు మొదలయినవి ప్ర. భూ.
చేసితివి = చేసితిరి. } ద్వి. భూ.
చేసితిని = చేసితిమి.

**77.** ప్రత్యయాగమాదియయిన తాలవ్యాచ్చు పరంబగునపుడు ధాత్వంత యకారమునకు సత్వము.

౭౫-వ విధిచేత ధాత్వంతలోకారమునకు లోపము.

ఉ. చేసెను, వెలసెను, మెరసెను, కూసెను, త్రోసెను, వేసెను.
చేసినాఁడు, చేసినది, చేసినవి, ఈ క్రియలయొక్క సంక్షేపరూపమయిన చేసెను అనునది స్త్రీపుంలింగంబులందు ఏకవచనమునకును నపుంసకమునందు రెండు వచనములకును వచ్చును.

ఉ. పక్షి చేసెను. రాముఁడు చేసెను.
పక్షులు చేసెను. సీత చేసెను.

| | ఏ. | బ. |
|---|---|---|
| పు. | చేసినాఁడు | } చేసినవి. |
| స్త్రీ. | చేసినది. | |
| న. | చేసినది | |

ఈ నాల్గు రూపములలోను ప్రత్యయభాగమయిన 'ఆఁడు, అది, అవి, అది' అనునవిలోపింపఁగా, చేసి అనినిలుచును. ఇకారమునకు ఎత్వము రాఁగా, చేసెను అని వచ్చునది.

**78.** పడ్వాదులకు పరమైన ఇత్వాగమముయొక్క ఇకారమునకు లోపమును తకారమునకు పూర్వవర్ణాదేశమును పాక్షికముగ వచ్చును.

ఉ. పడినాఁడు = పడ్ + నాఁడు = పడ్డాఁడు.

పడు, ఇడు, చెడు, అను, కను, కొను, తిను, మను, విను, చను, ఇవి పడ్వాదులు.

| | | |
|---|---|---|
| ఇడ్డాఁడు | కన్నాఁడు | మన్నాఁడు |
| చెడ్డాఁడు | కొన్నాఁడు | విన్నాఁడు |
| అన్నాఁడు | తిన్నాఁడు | చన్నాఁడు మొదలయినవి. |

ఈరూపంబులకు కావ్యంబులందు విశేష ప్రయోగంబులు లేవు.

**79.** ఇనాగమముయొక్క నకారమునకు యకారము ఆదేశమగును. యకారమునకు పూర్వమయిన ఇకారమునకు లోపము.

ఉ. చేసినాఁడు = చేసియాఁడు = చేశాఁడు

వేసినాఁడు = వేసియాఁడు = వేశాఁడు

కోసినాఁడు = కోసియాఁడు = కోశాఁడు

వచ్చినాఁడు = వచ్చియాఁడు = వచ్చాఁడు

తెచ్చినాఁడు = తెచ్చియాఁడు = తెచ్చాఁడు

తిట్టినాఁడు = తిట్టియాఁడు = తిట్యాఁడు

ఆడినాఁడు = ఆడియాఁడు = ఆడ్యాఁడు

చేసినాఁడు మొదలయినవాని గ్రామ్యరూపములయిన చేశినాఁడు మొదలయినవానికిని పైఁజెప్పిన చేశాఁడు మొదలయిన రూపములు వచ్చును. ఈక్రియలు గ్రామ్యంబులు.

**80.** ఆ యకారమునకు తాలవ్యహలంత ధాతువులకు పరంబుగ లోపంబగు ఇతర ధాతువులకు పరంబుగ లోపంబు లేదు. ఇది పైఁ జెప్పిన ఉదాహరణంబులచేత వ్యక్తమగు.

తాలవ్య హలంత ధాతువులు చేయు, వేయు, కోయు, వచ్చు, తెచ్చు మొదలయినవి.

**81** బహువచనమందు యకారమునకు పరమైన ఆకారోకారములకు వర్ణసమీకరణవిధిచేత ఇత్వమును య లోపంబును వచ్చును.

ఉ. చేశారు = చేశ్యారు = చేశ్యిరి = చేసిరి.
కొట్ట్యారు = కొట్ట్యిరి = కొట్టిరి.
తిట్ట్యారు = తిట్ట్యిరి = తిట్టిరి.
ఆడ్యారు = అడ్యిరి = అడిరి.

ప్రాచీన వైయాకరణులు యథేష్టముగా కొన్ని విభక్తి రూపములను శుద్ధములని గ్రహించి కొన్నింటిని గ్రామ్యమని విడిచిపెట్టినారు. కొట్ట్యారు వేశారు అనువానిని కొట్టినారు, వేశినారు అనువానియొక్క వికృతములని పరిత్యజించిరి. ఇట్లుండఁగా కొట్ట్యారు, వేశారు అనునవి తిరిగి వికారములనుబొంది కొట్టిరి వేసిరి అని కాఁగా వికృతములయొక్క వికృతము లయిన ఈరూపములను ప్రాచీనపండితు లతిగ్రామ్యములనివిడువక యెట్లు పరిగ్రహించిరో తెలియదు.

**82.** అయమాంతంబును గురువిరహితమును అయిన ఏకస్వర ద్విస్వర ధాతువులకు పరంబుగ ఆగమముయొక్క ఎకారమునకును ఇంచు ప్రత్యయముయొక్క ఇకారమునకును పూర్వమున ఇయాగమము వచ్చును.

అదన్తము యకారాంతము కాని ధాతువు. భుజించు, భుజియించు, జనించు, జనియించు, మొదలయినవి. నయించు; దీనియందు ధాతుభాగమయిన నయ్ యాంతము; నయియించు అని రాదు.

ఉ. నగెను = నగియెను, పడెను = పడియెను. కొనెను = కొనియెను.

**83** నకారాంత ధాతువులకు పరంబుగ ఇతాగమము యొక్క ఇకారమునకు లోపమును తకారమునకు టత్వమును పాక్షికముగ నగును.

ఉ. అనితివి = అంటివి అనితిరి = అంటిరి. అనితిని = అంటిని. అనితిమి = అంటిమి.

ఇట్లు తిను, విను, కను, చను, మను, కొను మొదలయినవాని రూపంబు లూహ్యంబులు. వర్తమానంబునందు అంటారు, వింటారు, తింటారు మొదలయినవానియందలి తకారమునకు టాదేశము వచ్చుటను చూడుము.

ఈసూత్రంబునందు చెప్పంబడిన ఇలోపము గ్రామ్యమునందు యాంత చాంత ధాతువులకు పరంబుగ బహుళంబుగ వచ్చును.

ఉ. వేస్తిని, చేస్తిని, మోస్తిని, తెస్తిని, వస్తిని.

**84.** ఉండు ధాతువుయొక్క డువర్ణమునకు ఇతాగమ తకారము పరమగునప్పుడు లోపము వైకల్పికము. డువర్ణము లోపించునెడ తకారమునకు పైసూత్రముచే టత్వము.

ఉ. ఉండితివి = ఉంటివి. ఉండితిరి = ఉంటిరి.
ఉండితిని = ఉంటిని. ఉండితిమి = ఉంటిమి.

**85.** ఇవి ఉవు ప్రత్యయముల తుది యక్షరమునకు లోపము పాక్షికముగ నగు.

ఉ. ఆనిలివి = అనిలి చేసిలివి = చేసిలి. పోలివి = పోలి.
వండిలివి = వండిలి.

**86** భవిష్యత్కాలము.—భూతమునందు చేసినాఁడు, చేసినది, చేసినవి అను క్రియలు చేసె అని సంక్షిప్తమయి నట్లు భవిష్యత్తునందు చేయునాఁడు, చేయునది, చేయునవి అనునవి చేయుఁగా అని సంక్షిప్తము కాలేదు.

అరవమునందును శెయ్యుమ్ అనునది శెయ్వాన్ శెయ్వాళ్ చెయ్వదు శెయ్వన అను నీనాల్గుక్రియలకు బదులు గావచ్చుచున్నది. చేయువాఁడు అను క్రియలో చేయు అను ధాతువునకు వెనుక నకారము లుప్తమయి యున్నది. ఈ నకారము చేయునది చేయునవి అను క్రియలలో ప్రత్యయములకు పూర్వమున నున్నది. ఈ నకారము అరవములో నుండు శెయ్యుమ్ అను క్రియయొక్క తుదలోనుండు మకారమునకు ఆదేశముగా వచ్చినది. అరవములో శెయ్యుమ్ అను క్రియ శెయ్యుందు అని వికృతమయివచ్చును. ఇదియే తెనుఁగున చేసెదు అయినది. దీనికి ఉను అను అంత ప్రత్యయమును చేర్చి వర్ణసమీకరణవిధిచే ఎకారమునుపట్టి ఉను ప్రత్యయము యొక్క ఉకారములను సాక్షికముగా ఇకారములుగా మార్చిన

చేసెదును
చేసెడిని

అని రెండు రూపములు సిద్ధించుచున్నవి.

ఇట్లు స్త్రీలింగ పులింగములందు ఏకవచనమునందును నపుంసకలింగమునందు రెండు వచనములందును మూఁడు రూపములు వచ్చుచున్నవి.

ఉ. పక్షి / పక్షులు } కూయును. / కూసెడిని. / కూసెదును.

బాలుఁడు } చదువును, చదివెడిని, చదివెడును.
బాలిక }

**87.** భూతభవిష్యత్తులందు కాలవ్యాప్త్యులంబట్టి యకారంబునకువచ్చు సకారము ఈ సంక్షిప్తరూపంబులందు ఉకారమునకు మునుపుగూడ గ్రామ్యంబునందు వచ్చును.

ఉ. తెలుసును, చేసును, వ్రాసును, పోసును, మేసును.

**88.** పైఁజెప్పిన సంక్షిప్త క్రియలయొక్క తుది నకారమునకు వాక్యాంతమునందు లోపము విభాషనగును.

ఉ. అగును - అగు. చేయును - చేయు. వచ్చెను - వచ్చె.

ఈక్రియ ధాతుజన్య భవిష్యదర్థక నామవిశేషణములతో నేకరూపము అయినప్పటికిని, ఆరెండుక్రియలును భిన్నములని తెలిసికొనవలయును. నామవిశేషణములు పూర్వము అకారాంతముగానుండి వెనుక నాయంత్యాకారము లోపించి దానికి పూర్వమునందుండు వకారము అరవమునందు మకారమును తెనుఁగున నకారమును అయ్యె. కన్నడమునందు మాఱకయుండును.

ఉ. క. పాడువ. అ. పాడుమ్. తె. పాడున్. 'పాడఁగల'

**89** మధ్యమోత్తమపురుషములయందు ఉదాగమము భవిష్యత్కాల వాచకమయినది, ఈ ఉదాగమముయొక్క దకారము కన్నడ ద్రవిడభాషలలోని ఉవాగమముయొక్క వకారస్థానమందు ఆదేశమయినది.

| | తె. | | కన్న. |
|---|---|---|---|
| ఉ. | చేయుదు | = | గెయ్యువి. |
| | చేయుదురు | = | గెయ్యువిరి. |
| | చేయుదును | = | గెయ్యువెను. |
| | చేయుదుము | = | గెయ్యువెవు. |

అర. శెయ్యి = శెద్దు.
శెయ్యిర్ = శెద్దుర్.
శెయ్యీఞ = శెద్దూ.
శెయ్యోం = శెద్దుంమ్.

నాల్గవ వరుసలో ఆఱువరూపములందు వకారమునకు దకారాదేశము పాక్షికముగా వచ్చినట్లు తెనుఁగునందు డకారాదేశము నిత్యము.

**90** భవిష్యత్కాలాగమ మయిన ఉద్ అనుదాని యొక్క ఉకారమునకు ఎకారము వైకల్పికముగ నాదేశమగు. ఆదేశపూర్వమయిన యూకు సత్వము. (75 సూ.)

ఉ. చేసెదవు - చేసెదరు - చేసెదను - చేసెదము.

**91.** ధాత్వంతమునందు అనుస్వార పూర్వకమయిన చకారమునకు ఉదాగమము పరంబగునప్పుడు వైకల్పికముగా పత్వము అగును.

ఉ. ఆకర్షింపుదురు = ఆకర్షించు + ఉద్ + ఉరు.
దంపుదురు = దంచు + ఉద్ + ఉరు.
చింపుదురు = చించు + ఉద్ + ఉరు.

దత్వము లేనిపక్షంబున ఉదాగమమునకు పూర్వమయిన చుకారమునకు లోపమును దకారమునకు తత్వమును అగును.

ఉ. ఆకర్షించుదురు = ఆకర్షింతురు.
దంచుదురు = దంతురు.
చించుదురు = చింతురు

ఈ కార్యము ఉదాగమముయొక్క ఉకారమునకు ఎత్వము వచ్చిన పక్షమున లేదు; ఆకర్షించెదరు-దంచెదరు-చించెదరు.

**92.** ధాత్వంతమునందు చకార ద్విత్వమునకు ఉదాగమము పరంబగునపుడు ఆయాగమముయొక్క ఉత్తునకు లోపమును చకార దకారములకు తద్వయాదేశమును అగును. దీర్ఘపూర్వమయిన చకారమునకు లోపము; దకారమునకు తత్వము

ఉ. వచ్చుదువు = వచ్చ్ + దువు = వత్తువు.
తెచ్చుదువు = తెచ్చ్ + దువు = తెత్తువు.
నొచ్చుదువు = నొచ్చ్ + దువు = నొత్తువు.
ఇచ్చుదువు = ఇచ్చ్ + దువు = ఇత్తువు.
చూచుదువు = చూచ్ + దువు = చూతువు.

ఈ కార్యము ఉదాగమముయొక్క ఉకారమునకు ఎత్వము వచ్చిన పక్షమున లేదు. వచ్చెదవు, తెచ్చెదవు, నొచ్చెదవు, ఇచ్చెదవు, చూచెదవు.

**93.** ధాత్వంత యకారమునకు ఉదాగమము పరంబగునపుడు ఉకారలోపము పాక్షికము. ఉకారలోపము వచ్చుచో యకారలోపమును దకారమునకు తకారమును అగును.

ఉ. వేయుందురు = వేతురు
వ్రాయుందురు = వ్రాతురు
మోయుందురు = మోతురు } ఇవి గ్రామ్యరూపములు.

**94** ఈ భవిష్యద్రూపమునందు ఉత్తమపురుష బహువచనముయొక్క ఉదాగమమునకు ఎకారాదేశములేక అము ప్రత్యయమును చేర్పఁగా ఉభయప్రార్థనార్థక క్రియవచ్చును.

ఉ. ఉండుదము, ఉందము; ఉండు.
పోవుదము, పోదము, పోవు.

వత్తము, వచ్చు.
ఇత్తము, ఇచ్చు.
చొత్తము, చొచ్చు.
నొత్తము, నొచ్చు.
చూతము, చూచు,
పిలఁతము } పిలుచు.
పిల్తము }

**95**. గ్రామ్యంబునందు భవిష్యదర్థకమునకు వేఱు రూపములు గలవు. వానికి సంశయ భవిష్యద్రూపములని పేరు పెట్టవచ్చును. ఇవి కన్నడమునందు విశేషముగాఁ బ్రయోగింపఁబడుచున్నవి. భవిష్యత్కాలాగమమైన ఉద్ అనుదానికి మూలరూపమయిన ఉవాగమముయొక్క వకారమునకు యకారాగమము చేయుటచే 'యా' రూపము వచ్చును.

| | కన్నడము. | | తెనుఁగు. |
|---|---|---|---|
| ఉ. | ఆడువను | ఆడ్యాను | ఆడేని |
| | ఆడువళు | ఆడ్యాళు | |
| | ఆడువదు | ఆడీతు | |
| | ఆడువరు | ఆడ్యారు | ఆడేరు |
| | ఆడువి | ఆడీయె | ఆడేవు |
| | ఆడువిరి | ఆడీరి | ఆడేరు |
| | ఆడువెను | ఆడేను | ఆడేను |
| | ఆడువెవు | ఆడేవు | ఆడేము |

ఆడువాఁడు, ఆడునది, ఆడునది, ఆడునవి, అను ఈ నాలుగు క్రియలకు మాఱుగా ఆడును అనునదివచ్చునట్లు ఆడేని అనునది సంశయార్థము

నందు ఆ నాలుగు క్రియలకు మాఱుగా వచ్చును. అది అడుగు అనుదానికి సమానము. మిగిలిన ఐదురూపములును కన్నడ క్రియలనుబోలియున్నవి. మధ్యమపురుషమునందు ఈ కారమునకు ఏ కారమును, ఆడేవు మొదలయిన రూపములయొక్క చివరయందు కన్నడప్రత్యయములకుబదులుగా తెనుఁగు ప్రత్యయములును వచ్చియున్నవి.

### 96. ప్రార్థనాద్యర్థకము.

౧. ప్రార్థనాద్యర్థకములందు కేవల ధాతువులు రూప భేదము లేక వచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| ఉ. | ఆడు | తిను | దాఁటు | మీఱు |
| | పాడు | విను | చేరు | క్రోలు |
| | వేఁడు | కొను | తేరు | వ్రాలు |
| | పడు | కొట్టు | పాఱు | ప్రేలు |
| | చెడు | తిట్టు | కోరు | తేలు |
| | పఱచు | నడచు | కఱచు | చెఱచు |

వీనిలోఁ ధాతురూపములకు భేదము కలుగలేదు.

౨ విశేషధాతువులు రూపభేదముతో వచ్చును.

| | | |
|---|---|---|
| ఉ. | తె - తెచ్చు | చూడు - చూచు |
| | రా - వచ్చు | పో - పోవు |
| | విడు - విడుచు | ఈ - ఇచ్చు |

వీనిలోఁ ధాతురూపములు భిన్నమయి యున్నవి.

3. ధాతువులు పురుషప్రత్యయములతోఁ జేరివచ్చు క్రియలు.

చేయుము = చేయుం + ఉపరి.

చేయుండు = చేయు + ఉండు.

౮. ధాతువులు ప్రత్యయములతోను కాలవాచకాగమముతోను వచ్చును; ఈ క్రియలు భవిష్యదర్థక క్రియలు. అగును—నీకు శుభంబగును.

చేయుందము = చేయు + ఉద్ + అము.

వక్త, శ్రోత, ఈ యిరువురయొక్క ప్రార్థన.

అగును చేయుదము ఈరెండును కేవలభవిష్యదర్థకములు. ప్రయోగబలముచేత నవి ఆశీరాద్యర్థకములయినవి. ఈ ప్రయోగము ద్రవిడ కర్ణాటక భాషలందును గలదు.

క. అం. ఎల్లర్ ఈగళ్ అశ్వమేధవంమాడువం.

అ. నామ్ ఎల్లార్ ఈజ్గు అశ్వమేధత్తైపణ్ణువాం.

౯. భావనాటుములు ఆశీరాద్యర్థమునందుఁ బ్రయోగింపఁబడును.

నీకు మేలుకలుగుతను. కలుగుతక=కలుగుట; అ. కిడైత్తల్.

వాఁడు రాని. అ. అవన్ వరల్. క. అవను బరలి.

**97.** ధాతువులకు ఏకవచనమున ఉము ప్రత్యయమును బహువచనమున ఉండు, ఉఁడు ప్రత్యయములను చేర్పుటచే ప్రేరణాద్యర్థరూపములు గలుగును.

ఉ. చేయుము = చేయు + ఉము. అ. శెయ్యుమ్.

చేయుండు } చేయు + ఉండు.
చేయుఁడు }

ఉమ్మునకు ప్రకృతి అరవప్రత్యయము ఉమ్. ఇది బహువచనమందు అరవములో వచ్చినను ఇచ్చట ఏకవచనమందె ప్రయుక్తమగును.

ఉండు. ఉమ్మువలనఁబుట్టినది. ఉమ్+ఉ = ఉమ్+డ్+ఉ. ఉకారము అంతమునందువచ్చిన నిరర్థక ప్రత్యయము. డకారము ఆగమము.

ఉమ్+డ్+ఉ = ఉన్+డ్+ఉ = ఉండు. మకారమునకు అనుస్వారాదేశము.

**98.** ధాత్వంతంబునందుండు ఇంచు చకారమునకు పకారమును ద్విరుక్తముకాని యన్యచకారమునకు పకారమును ఉము ఉండు ప్రత్యయములకు పూర్వమునందు ఆదేశము లగును. (౮౮)

ఉ. ఇంచు చకారము. పచించు పచింపుము.

పచింపుఁడు.

అడంచు అడంపుము.

అన్య చకారము. పిలుచు పిలువుము.

పిలువుఁడు.

ఖండబిందుపూర్వమగు చకారమునకును పకారమువచ్చును.

ఉ. తలఁచు తలఁపుము

త్రేఁచు త్రేఁపుము

తోఁచు తోఁపుము.

ఏఁచునకు వైభాషికంబు.

ఏఁచు ఏఁచుము

ఏఁపుము

నోఁచునకు లేదు.

నోఁచు నోఁచుము.

బిందుపూర్వమయిన ధాతుజ చకారమునకు పకారము బహుళంబుగనగు.

తలంచు తలంపుము.

మించు మించుము.

| | |
|---|---|
| కాంచు | కాంచుము. |
| ఇంచు | ఇంచుము. |

**99.** కొన్ని విశేషరూపములు సూత్రవిరుద్ధములయి యుండును.

ఉ. రమ్ము = అ. వారుమ్ = వ్రామ్ = వ్రమ్ము; ఉకారము అంత ప్రత్యయమును మద్విత్వమును వకార లోపమును రాఁగా, వారుమ్ రమ్ము అయినవి.

రండు = అ. వారుమ్. తె. వారుండు = వ్రండు.

తెమ్ము, తేరుము } అ. తారుమ్ = తేరుము, తారునకు తెనుఁగున తేరు ఆదేశము, రేఫలోపము, ఏకారమునకు హ్రస్వము, మకారమునకు ద్విత్వము.

తేరుండు, తెండు } పైఁజెప్పినదానివలె.

ఇమ్ము = అ. ఈయుమ్ = ఈయుము, యకారలోపము, ఈకారమునకు హ్రస్వము, మకారద్విత్వము.

ఇండు = అ. ఈయుమ్. తె. ఈయుండు, యలోపము, ఈకారమునకు హ్రస్వము.

అగుము, కమ్ము, అగుఁడు, కండు } అవుము, ఔము, అవుండు, ఔఁడు

అగుము పాక్షిక వర్ణప్లుతిచేత కాము అయ్యె, అకారమునకు హ్రస్వము, మకారమునకు ద్విత్వము.

అగుండు వర్ణప్లుతిచేత కాండు అగును. అకారమునకు హ్రస్వము రాఁగా కండు అగును. ఇక్కడ అనుస్వారమునకు ఏకలక్ష్య

త్వరము పూర్వమందు లేక యుండుటచేత అర్ధానుస్వారాదేశము లేదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పో. | పోవుము | నేరుచు. | నేరువుము | పిలుచు. | పిలువుము |
| | పొమ్ము | | నేరుము | | పిలుము |
| | పోవుండు | | నేరువుండు | | పిలువుండు |
| | పొండు | | నేరుండు | | పిలుండు. |
| కొను. | కొనుము | చొచ్చు. | చొరుము | చూచు. | చూడుము |
| | కొమ్ము | | చొరుండు | | చుమ్ము |
| | కొనుఁడు | నోచ్చు. | నోవుము | | చుము |
| | కొండు | | నోవుండు | | చూడుండు |
| | | లేచు. | లెమ్ము | | చుండు |
| | | | లెండు | | చుఁడు. |

చుండులొనుండు పూర్ణానుస్వారమునకు పాక్షికముగ నర్ధానుస్వారము అగును.

**100.** అన్ ప్రత్యయాంతభావనామము ప్రేరణార్థకమునందువచ్చును. ఈరూపమునకు కన్నడమునందు ఉండునట్లు ఇకారము అంతమునందుండును.

ఉ. వాఁడుచేయని - చేయని = చేయన్+ఇ.

క. అవమగెయ్యలి - గెయ్యలి = గెయ్యల్+ఇ.

| | | | |
|---|---|---|---|
| కాని | | | (అగు) |
| అనని | - | నాని | (అను) |
| కనని | - | కానని | (కను) |
| పోవని | - | పోని | (పో) |
| నేరుపని | - | నేరని | (నేరుచు) |
| తేరని | - | తేని | (తెచ్చు) |

ఈయని - ఈని (ఇచ్చు)
చోరని - (చొచ్చు)
నోవని - నోని (నొచ్చు)

**101** కాని యనునది భేదార్థమందు క్రియావిశేషణ మగును.

ఉ. 'నీకు నీశ్వరుండ యాజకత్వంబు సేయనోపుంగాని యొరులోపరు', ఆది.

వ్యతిరేక సంభావనార్థంబునందును వచ్చును.

ఉ. 'వానింజూచికాని కడునవొల్లను'. ఆది. 'వానింజూడనియెడల నేను కుడువనొల్లను' 'నాయుదరంబు భేదిల్లినంగాని యిమ్మునికుమారుండు వెలువడ నేరండు' ఆది. 'నాయుదరంబు భేదిల్లని యెడల నిమ్ముని కుమారుండు వెలువడనేరండు.' వికల్పమందు నేఁడుకాని, రేపుకాని. వాఁడుకాని వీఁడుకాని. ఇట్లె కన్నడమందు అవనాగలి ఇవనాగలి బరలి,

**102.** తన్ (అఱవమునందు తల్) అంతమందుఁగలిగిన భావనామము ఆశీరర్థంబున వచ్చును.

ఉ. అగుతఁ, కావుతఁ, కాతఁ. పోవుతఁ, కలుగుతఁ.

**103.** ద్రవిడంబునందు కైయను క్రియానామప్రత్యయము తెనుఁగున 'క' అని యగును. ఈ క ప్రత్యయాంతము యిన పదములు రాక, పోక, అనిక, తూనిక, మొదలయినవి. ఈ క్రియ ప్రాచుర్యంబునందు వ్యతిరేకంబున వచ్చును. నీవు ఆపనిచేయక; నీవునడవక. ఇట్లు మధ్యమపురుషంబునందు వచ్చును.

**104.** అగుధాతువునకు కప్రత్యయము చేర్చుటవలనఁ బుట్టినది కాక; ఇదిమాత్రము ప్రార్థనాద్యర్థమునందు వచ్చును.

ఉ. అట్టులకాక.

ఈ క్రియ అభావసంభావనయందును 'కాని' వలె వచ్చును.

ఉ. "నీవు నలునకుఁ జేర్మితో దేవివైనఁ గాక
నీ సముజ్జ్వలరూపకాంతివిభవ
నిత్య సౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర
లక్షణావళులవి సఫలంబులగునె". అరణ్యా.

**105.** అని ప్రత్యయమును భవిష్యదర్థక క్రియాజన్య విశేషణమునకు చేర్చుటచేఁ బుట్టునట్టి భవిష్యదర్థక భావనామము. విధ్యర్థమునందు వచ్చును.

ఉ. నీవు ఈ కార్యమును చేయఁనని.

క. నీను ఈ కార్యవన్ను గెయ్యువను.

అర. నీ ఇకార్యత్తైచ్చెయ్యదు.

ఉ. "ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగ నోరు వేఁడకుండునది యభిముఖులై
వచ్చిన యాకార్థులవృథ
పుచ్చకయుండునదిసర్వభూతప్రీతిగా". జక్కన విక్రమార్క.

**106.** భవిష్యత్కాలమునందు ఉదాగమమును అము ప్రత్యయమును బొందిన ఉత్తమపురుష బహువచనక్రియ ఉభయప్రార్థనార్థమునందు వచ్చును.

ఉ. మనము చేయుదము,

వత్తము=వచ్చుదము.
మనయశోద చిన్న మగవానిఁ గనెనట
చూచివత్తమమ్మ సుదతులార. భాగవ.

పదము=పోవుదము.

పగమాయెలదోఁటఁ జరింపకింటికిన్. మను.

**107.** భవిష్యత్కాలమునందలి ఏకవచనమునకు వచ్చెడు ఉన్, ఎడిన్, ఎడున్, ప్రత్యయాంతములయిన క్రియలు ఆశీరర్థమునందుఁ బ్రయోగింపఁబడును.

ఉ. నీకు శుభంబగును. నీకు మేలుకలిగెడిని. నీకు మేలుకలిగెడును.

"అత్రిహారక్రియాభిరతుఁడై కృతసన్నిధియై ప్రదక్షిణా
వర్తశిఖాగ్రహస్తముల వహ్నిమహాద్విజ దివ్యమంత్ర ని
ర్వర్తిత హవ్యముల్ గొనుచు శారిజవైరి కులేశ నీకు సం
పూర్తమనోరథంబులును బుణ్యఫలంబులునిచ్చుచుండెడున్." భార.

**108.** అన్ప్రత్యయమును జేర్చుటచేత భావనామములు సిద్ధించును.

ఉ. చేయన్, రాన్, పోన్, నడవన్, కుడువన్

కన్న. గెయ్యల్, బరల్, హోగల్, నడెయల్, కుడియల్.

అర. శెయ్యల్, వరల్, పోగల్, నడక్కల్, కుడిక్కల్.

**109.** ఈ అన్నంతనామములు ప్రథమాచతుర్థీసప్తమీవిభక్తులందువచ్చును. చతుర్థీసప్తమ్యర్థములందు విభక్తిప్రత్యయము చేర్పఁబడదు.

ఉ. చేయన్, తగును, అగును, వచ్చును.

క. గెయల్, తగుగుం, ఆక్కుం, బక్కుం.

అ. శెయల్, తగుమ్, అగుమ్, వరుమ్.

| తె. | క. | అ. |
|---|---|---|
| చేయన్ వచ్చినాఁడు. | గెయ్యల్ బందను. | శెయ్యవందాన్. |

చేయన్ 'చేయుటకు' అని యర్థము.

సూర్యోదయంబున్ సేను లేచితిని.

ఉదయింపన్, 'ఉదయించుటయందు' ఉదయించుకాలమునందు అని యర్థము.

ఇట్లు చతుర్థీ సప్తమీ విభక్త్యర్థములతో విభక్తిప్రత్యయములు లేక వచ్చు అన్నంతభావనామములను తుమున్నంతమని ప్రాచీనులు పేరుంచి యున్నారు.

**110.** అన్ప్రత్యయము పరమగునపుడు ధాత్వంతము నందుండు ద్విరుక్తమును బిందుపూర్వమునుగాని చకారము నకు వత్వము.

ఉ. అఱవన్ = అఱచు + అన్.

కఱవన్ = కఱచు + అన్.

ఇట్లు,

| | |
|---|---|
| నిలువన్ నిలుచు | కావన్ కాచు |
| నడవన్ నడచు | లేవన్ లేచు |
| మఱవన్ మఱచు | ఈడువన్ ఈడుచు |
| విడువన్ విడుచు | ఊడువన్ ఊడుచు |
| ప్రోవన్ ప్రోచు | ఓరువన్ ఓరుచు |

**111.** బిందుపూర్వక చకారమంతమందుఁగలిగిన ధాతువులకు పరముగ అన్ప్రత్యయము రాఁగా చకారమునకు పత్వము.

| | | |
|---|---|---|
| నుతింపన్ నుతించు | పంపన్ పంచు | చింపన్ చించు |
| స్తుతింపన్ స్తుతించు | వంపన్ వంచు | వింపన్ వించు |

క్రిందవచ్చునవి విశేషరూపములు.

| | | |
|---|---|---|
| చేరువన్ / చేరన్ } చేరుచు | కోలెన్ / కోలెన్ } కోను | కోనన్ / కోన్ } కోను |

| | | | | | |
|---|---|---|---|---|---|
| పిలువన్, పిలన్ | పిలుచు | కాన్, కన్ | అగు | తేరన్, తేన్ | తెచ్చు |
| పోలెన్, వలెన్, బలెన్ | పోలు | నాన్, అనన్ | అను | రాన్ | వచ్చు |
| | | | | ఈయన్, ఈన్ | ఇచ్చు |

పోలెన్, వలెన్, గొలెన్, గోలెన్ వీనియందు అన్వ్రిత్యయాకారమునకు ఎత్వము. పోలెన్ యొక్క ఓకారమునకు అకారమును పకారమునకు వకారమును రాఁగా 'వలెన్' సిద్ధించును. కొను ధాతువుయొక్క నకారమునకు లత్వమును ఒకారమునకు పాక్షిక దీర్ఘమును రాఁగా గొలెన్ గోలెన్ అగును.

వానింబోలెన్ 'వానిని పోలునట్లు' అని యర్థము.

వానివలెన్=వానినివలెన్ = వానిన్‌వలె వలెన్ శబ్దముయొక్క ఆద్యవకారము స్థిరము అగుటచేత పూర్వమయిన నకారమునకు లోపము.

నాఁటఁగోలెన్=నాఁటనుకొనన్; అనఁగా 'నాఁటను మొదలుగాఁగొని' యని యర్థము.

గొలెన్ "అరామతిశోణికిఁ జన్న నాఁటఁగొలె", వసు.

గోలెన్

"జనసుతయేనుహిడింబుం
దనురక్షను చెలియలం బ్రియంబున నినుఁ జూ
చిన యప్పటఁ 'గోలెను' గడు
మనోజశరపీడ్యమాన మానసనైతిన్." భార.
"ఇతఁడుపుట్టిన 'గోలెను' సెనక మెసఁగ." భార.

నాన్=అనన్.

"దీనివగస్తి 'నాఁ'బరఁగు దివ్యమునీంద్రుఁడు తొల్లి ప్రీతితో
భూసుత యగ్ని దేశ్యుఁడను భూరి మునీంద్రునకిచ్చె", భార.

"మానిను లసత్యవచనలు
'నా' నిట్టు లసత్యభాషణం బుచితంబె", భార.

ఈక=ఈయక.

"...వరం
'బీ'వచ్చితిఁ గోరుమెద్ది యిష్టమునీకుఁ", భార.

**112.** కాఁ - కఁ ఈరెండును నామములతోను అన్నంతములయిన యితరభావనామములతోను అనుప్రయుక్తములయి నామముగను క్రియావిశేషణముగను వచ్చును.

చూడఁగన్ = చూడఁ + కన్. చూడఁ 'చూచుట' కఁ (అగన్) 'అగునపుడు' అనఁగా, 'చూచునపుడు' అని యర్థము.

చూడఁగవలయు, చూడఁ+కన్+వలయు. చూడఁ 'చూచుటయను కార్యము', కన్ 'అగుట సంభవించుట' వలయుఁ 'ఇష్టమగును,' 'చూచుటయనెడు కార్యము సంభవించుట ఇష్టమగును' అనఁగా 'చూచుట యిష్టమగును' అనియర్థము.

"'అచ్చముగ'మూఁడుమెచ్చులు
మెచ్చితిఁజిత్తమునఁగరుణమిక్కుటమయ్యెఁ
'నిచ్చలముగ'నడుగుమునీ
కిచ్చెదవలసినవరంబులెయ్యవియైనఁ", హరిశ్చం.

"దళముగ మేనసెల్ల భసితంబెసలార నలంది చర్మ మి
మ్ముల మెయిఁగప్పి భూతగణము 'ల్భజియింపఁగ' నిప్పరేత భూ
ముల వసియించినట్టి సమఁబోలినవాఁడవు నీవు నీకు నో
నలినహితాన్వయాభరణ నాన'వహింపఁగ'నేటికిమ్మెయిఁ." హరిశ్చం.

"మందాకినీపాండుమహితసైకతములఁ 'గ్రీడసల్పఁగ'నీకుఁబ్రియముకాదె".
శృంగారనైషధము.

"క్రచ్చుటకేటవచ్చియుంటిఁగణ్వమహామునిఁజూచి 'పోవఁగా' వచ్చితిమి" భా.

"అమితపరాక్రమంబును రయంబునులావును గల్గుఖేచరో
త్తముఁడవు పూని నీదయిన దాస్యమువాపి 'కావంగ' నీకుఁ జి
త్తముగలదేనిభూరిభుజదర్పముశక్తియుఁ 'నేర్పడంగ' మా
కమృతము దెచ్చియిమ్ము." భార.

"అని 'పోవఁగ' వచ్చెను." హరిశ్చం.

**113.** ఈ క్రియానామము వలయ్వాదులతోఁ జేరి వానికిఁ గర్తగావచ్చును.

ఉ. చేయన్ + వలయును.
— వలదు.
— కూడును.
— కూడదు.
— చెల్లును.
— చెల్లదు.
— తగును.
— తగదు.
— వచ్చును.
— రాదు.
— అగును.
— కాదు.

'కావలయును' = కాన్ + వలయును.

"నాకుదక్షిణిల్లెడుపుత్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్య బలసమన్వితుండును వంశకర్తయుఁ 'గావలయు'" భార.

'తలంపవలయును' = తలంపన్ + వలయును.

"క. జననాథ వేఁట నెపమున
గొనకొని కణ్వాశ్రమమునకున్వచ్చి ముదం
బున నందు నీవు నా కి
చ్చినవరముఁ దలంపఁ వలయుఁ జిత్తములోనన్". భార.

'చేయందగును' = చేయన్ + తగును.

"నాయందుఁ దొంటియట్టుల
చేయుమనుగ్రహము పజ్ఞ 'సేయందగునే' ". భార.

'నేరఁబోలును' = నేరన్ + పోలును.

"ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధియించు విధంబున మంత్రరక్ష యు
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దత్పరిరక్షణ శక్తి నెల్ల కా
ర్యమ్ములు సిద్ధిఁ బొందుఁ బరమార్థము మంత్ర విశేష మైనఁ గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతి కైనను 'నేరఁబోలునే.' " భార.

'వ్రేయంగవలయు' = వ్రేయన్ + కాన్ + వలయు.

"పొంగియుంకొక్కమాటు 'వ్రేయంగవలయు' ". హరివం.

'పలుకఁగనగును' = పలుకన్ + కొన్ + అగును.

"క. భూవినుత నిన్నుఁ ద్రిభువన
పావను నకుచిపని యెట్లు 'పలుకఁగనగు' న
ద్దేవి పవిత్ర పతివ్రత
గావున నకుచులకుఁ గానఁగాదన వద్యా". భార.

ఈ భావనామము యొక్క తుది నకారము సంధివిధుల చేతఁ బలువిధముల మారి వచ్చుటఁ బట్టి దీనిని గొందఱు పండితులు ఉత్తరపదములకుఁ గర్తృపదముగా గ్రహింపక వానితోఁ జేర్చి ఒక శబ్దముగా గ్రహించి పద స్వరూపమునకు విరుద్ధముగా లక్షణము చెప్పిరి. అది యెట్లనఁగా, చేయన్ వలయును అను రెండు పదములను ఒక పదముగా గ్రహించి దానిని వాక్యమునకుఁ గ్రియఁగాఁ జేసికొనిరి. ఆ క్రియ యొక్క సమస్యార్థమునకు వాఁడు అర్థికమైన

కర్తకుం బట్టి యీలక్షణము కేవలార్థికము. శబ్దస్వరూపమును బట్టి లక్షణము చెప్పవలెడల వలదు కూడదు అనుపదముల తుదిని దు అను నపుంసకలింగైకవచనప్రత్యయము వాఁడు అను కర్తకు విరుద్ధమగుటచే వలయుం బొంద అయినవానికిం బూర్వపదమె కర్తయనుట యుక్తము.

## భవిష్యదర్థక్రియావిశేషణము.

**114**. అన్ప్రత్యయాంతమయిన భావనామము చతుర్థీవిభక్త్యర్థమున విభక్తిప్రత్యయము లోపింప భవిష్యదర్థక్రియావిశేషణముగా వచ్చును. దీనికే తుమున్నర్థకమని పేరు.

చేయం బోయినాఁడు 'చేయుటకుం బోయినాఁడు'.

పఠింపఁ బాఠశాలకేగినాఁడు. 'పఠించుటకుఁ గాను పాఠశాలకు పోయినాఁడు'

'పలుకన్' పలుకుటకు.

" నాయొద్దనె 'పలుక' నీకు నాన కుం లేదే". భార.

'ఈన్'=ఇయ్యన్ ఇచ్చుటకు.

" వరం
'బీ'వచ్చితిఁ గోరుమెద్ది యిష్టము నీకున్". భార.

**115**. ఈయర్థమునందు కాన్, కన్ అను భావనామము అనుప్రయుక్తమగును.

'చేయంగన్'=చేయన్+కాన్; చేయన్ 'చేయుట', కాన్ అనుటకు.

" ఏను గచుం డనువాఁడ న
హానియును సమన్వితుఁడ బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా శిష్యవృత్తిఁ 'బనిసేయంగన్'." భార.

'తేరఁగన్'=తేరక + కాన్ ; పైఁజెప్పినదానివలె, తెచ్చుటకు అని యర్థము.

" అడవికిఁ బువ్వులు 'తేరఁగ'
వడి నరిగిన కచునిఁ జంపి వానిని దనుజుల్
పొడవుగ నడఁగాల్చి సురతోఁ
దడయక యబ్బూది శుక్రుఁ ద్రావించి రొగిన్". భార.

## భూ తా ర్థ క్రి యా వి శే ష ణ ము.

**116.** ధాతువునకు ఇకారము చేర్చుటచేత భూతార్థ క్రియావిశేషణము వచ్చును.

ఉ. వచ్చి = వచ్చు+ఇ. ఆడి = ఆడు+ఇ.
తెచ్చి= తెచ్చు+ఇ. కొట్టి=కొట్టు+ఇ.

ఈ క్రియలు ఆఱవము మొదలయిన భాషలలో ఉకారాంతములు కాని యితర ధాతువులవలె డుప్రత్యయము అంతమునందుఁ గలిగియుండినవి. అట్టుండినయెడల అవి వచ్చిదు, తెచ్చిదు, ఆడిదు, పాడిదు అని యుండవలయు. దుకారములోపింపఁగా వచ్చి, తెచ్చి, ఆడి, పాడి, అనిసిద్ధించినవి.

**117.** యకారాంత ధాతువులకు ఇప్రత్యయము పరంబగునపుడు యాకు సత్వమగును. (౭౭-వ విధి చూడు).

ఉ. చేసి = చేయు+ఇ.
వేసి = వేయు+ఇ.
కోసి = కోయు+ఇ.

**118.** అగు పోవుధాతువులకు ఇప్రత్యయము పరమగునపుడు గకార వకారములకు యకారాదేశంబు అగును.

ఉ. అయి = అగు + ఇ = అగి, అ. అగి;
అయి, ,, అయి.
పోయి = పోవు + ఇ = పోవి, ,, పోగి;
= పోయి, ,, పోయి.

**119.** ఈ క్రియావిశేషణముతో వేఱుధాతువులు అనుప్రయుక్తములగుటచేత అనేక సమస్తధాతువులు పుట్టును.

ఉ. చేసివేసెను, చేసికొనెను, చేసియిచ్చెను, కట్టివేసెను, కట్టికొనెను, కట్టియిచ్చెను.

**120.** యకారాంతధాతువునకు కొనుధాతువు అనుప్రయుక్తమగునపుడు పైఁజెప్పిన ఇప్రత్యయమునిత్యము. ఇతరధాతువులకు అనుప్రయుక్తమగునపుడు ఆ ప్రత్యయమునకు పాక్షికలోపము.

ఉ. చేసికొనెను, వేసికొనెను.
వ్రాసికొనెను, మూసికొనెను.
పట్టుకొనెను, పట్టికొనెను.
తిట్టుకొనెను, తిట్టికొనెను.

ఇకారము లోపింపక యుండుటకు కారణము ఏమనఁగా, ఇకారము చేరఁగా యకారమునకు సత్వము ఆదేశమగుచున్నది. ఇకారలోపమయినయెడల యకారమునకు సత్వము లేకపోవును. అప్పుడు చేయుకొని అని చెప్పవలయు. ఇకారసంయోగముచేత యాకు వచ్చిన సత్వము తొలఁగక యుండుటఁబట్టి ఆసత్వమునకు కారణమయిన ఇకారము అవశ్యముగా నుండవలయు. గ్రామ్యభావమలో ఇకారమునకు లోపము వచ్చును. వచ్చియు సకారము తొలఁగక నిలిచియుండును.

ఉ. తెలుసుకొను, చేసుకొను, వేసుకొను, వ్రాసుకొను, మూసుకొను,

**121**. తెచ్చుధాతువు అనుప్రయుక్తమగుచో ఈ ఇ ప్రత్యయమునకును ధాత్వంతాక్షరమునకును ప్రాయికంబుగ లోపంబగును. తెచ్చు ధాతువుయొక్క చకారమునకు ముందు అనుస్వారాగమమును ఒక చకారమునకు లోపమును అగును.

ఉ. అగు + తెచ్చు = అగుదెంచు.
నెగయు + తెచ్చు = నెగయుదెంచు.
పోవు + తెచ్చు = పోవుదెంచు.
చొచ్చు + తెచ్చు = చొత్తెంచు.
పుచ్చు + తెచ్చు = పుత్తెంచు.
తోఁచు + తెచ్చు = తోతెంచు.
నడచు + తెచ్చు = నడతెంచు.
పఱచు + తెచ్చు = పఱతెంచు.
మొలచు + తెచ్చు = మొలతెంచు.
వీచు + తెచ్చు = వీతెంచు. ఇత్యాదులు.

ఈ తెంచుధాతువు ఖండనార్థకమైన తెంచుధాతువుకాదనియు తెచ్చు ధాతువునందు చకారమునకు పూర్వమున నిష్కారణముగ ననుస్వారమును ఉంచుటచేత తెచ్చు తెంచు అయినదనియు తెలిసికొనవలయు. దానికి తుమున్నర్థకము మొదలయినరూపములు తెచ్చుధాతువునకు వచ్చునట్లె వచ్చును.

ఉ. అగుదేరక, అగుదేక, అగుదేరక, అగుదేక, అగుదేరమి, అగుదేమి.

**122**. ట ప్రత్యయాంతములయినభావనామములకు ఉన్వ్రి ప్రత్యయముఁ జేర్పఁగా భూతార్థక క్రియావిశేషణము వచ్చును.

ఉ. వచ్చుట + ఉన్ = వచ్చుటయున్ 'వచ్చినవెనుక' రాఁగాన్.
తెచ్చుట + ఉన్ = తెచ్చుటయున్ 'తెచ్చినవెనుక' లేఁగాన్.

ఇచ్చుట వచ్చుట తెచ్చుట అనునవి టప్రత్యయాంతభావనామములు. వానితో ఉన్ ప్రత్యయము చేరినవి.

ఉ. 'ఇయ్యకొనుటయున్' = ఇయ్యకొనుట+ఉన్.

"అందఱు నత్తెఱంగున 'కియ్యకొనుటయు' నతండు గాండీవంబు నవలో
కించి" భార.

'చనుటయున్' = చనుట+ఉన్.

"ఇంతి జేరఁగాఁ
జనిరొవిధాత్రిలుబ్ధశపకంబునఁబోవుప్పగంబుచాద్పునన్,
'చనుటయు' ద్రౌపదియతనింగని." భార.

'అనుటయున్' = అనుట+ఉన్.

"నీమా
టలు నేటిదాఁకనన్నృతం
బులఁటోరయవు నేఁడిదేల పోఁటకఁగనీకున్.
'అనుటయు' మేదినీరమణుఁడామునివర్యుతలంపెటింగి". హరివం.

'అగ్గించుటయున్'=అగ్గించుట+ఉన్.

" అనికాంతాజనములలోఁ
దను'నగ్గించుటయుఁ'బొంగిదర్పోద్ధతిని
ట్లనునుత్తరుండు". భార.

'అగుటయున్'=అగుట+ఉన్.

" ఇట్లు సూర్యోదయం'బగుటయు' ధృతరాష్ట్రుండు తత్కాలోచితా
చారంబులు నిర్వర్తించి." భార.

'చేయుటయున్'=చేయుట+ఉన్.

"నిష్ఠురాలాపంబులు బాణంబులుం బోలె మనోఘాతంబు 'సేయుటయు' నారాజన్యచూడారత్నంబు". హరివంశం.

**123.** అటువమునందు వచ్చునట్టి శెయ్యదు వరువదు అను భావనామముల, అదు ప్రత్యయముయొక్క డకారమునకు డాదేశమును అకారవకారములకు ఉత్వమును రాఁగా, వచ్చుదు చేయుదు అను భావనామములు పుట్టును. వీనికి ఉన్ ప్రత్యయము చేర్పఁగా ఆనంతర్యార్థక క్రియావిశేషణము పుట్టును.

ఉ. వచ్చుడుఁ, తెచ్చుడుఁ, కొట్టుడుఁ, తిట్టుడుఁ, జాబిలితో తెంచుడుం గువలయంబులు వికసిల్లె. తోతెంచుడుఁ - 'ఉదయించినవెనుక'. ఆటుదు 'ఆటుట' అమ్ముడు 'అమ్ముట' మొదలయినవి ఇట్లువచ్చిన భావనామములు.

'అనవుడుఁ'=అనుడుఁ.

ఉ. "'అనవుడు'నవ్వులుకులువిని
తనచిత్తము కలఁకదేఱి ధర్మతనూజుం
డనుజన్ముల దెసఁజూచిన
ననిలసుతుండిట్టులనియె నాతనితోడఁ". భార.

'అనుడుఁ'=అనుడు+ఉన్. అ. ఎన్నదుమ్. ప్రా. క. ఎన్నుదుం.

"'అనుడు'విమణ్ణమైనహృదయంబునగారవమొంద". భార.

'నావుడుఁ' = అనవుడుఁ - అనవుడుఁ అనుదాని మొదటి అకారము నకారమునకు వెనుక దుమికి యక్కడనుండు అకారమునకాదేశమయి దీర్ఘమయ్యె.

"'నావుడు' మోసెనాకసమునఁ విశదంబుగ దివ్యవాణి". భార.

నాటుడుఁ'=నాటుడు+ఉన్. అ. నాట్టువదుమ్.

"క. అందుఁదనదృష్టి 'నాటుడుఁ'
కందర్పనిశాతసాయకంబులు వెలుచన్
డెందమున నాటధృతిచెడి
కందిమునీంద్రుండు దానిఁ గవియుండిపిరెన్". భార.

'అగుడున్'=అగుడు+ఉన్.

" నాకునిర్వ్వరమిమ్మని నన్ను 'అగుడు' ", భార.

**124.** భూతార్థక ధాతుజన్య విశేషణముతో దనుక దాఁక అనుపదములను జేర్పఁగా అవధ్యర్థక భూతార్థక క్రియా విశేషణములు వచ్చును.

ఉ. "క. అక్షౌహిణిసామంతుల
నీక్షణమునఁగొనుచు వేగ మేవచ్చెదనా
రాక్షసులకెదిరినీముఖ
రక్షయొనర్చెదనుధరను 'బ్రదికినదాఁకన్' ". భాస్కర.

**125.** తోడన్ తోన్ ప్రత్యయములు ట ప్రత్యయాంత భావనామములకుఁ జేర్ప భూతార్థక క్రియావిశేషములు వచ్చును.

ఉ. వచ్చుటతోడన్ } వచ్చిన వెనుక.
వచ్చుటతోన్ }

చేయుటతోడన్ } చేసిన వెనుక.
చేయుటతోన్ }

## వర్తమానార్థక క్రియావిశేషణము.

**126.** ధాతువునకు ఉచు, ఉచున్ ప్రత్యయములు చేర్చుటచేత వర్తమానార్థకవిశేషణము పుట్టును.

ఉ. చేయుచు = చేయుచుఁ        నడచుచు = నడచుచుఁ

వచ్చుచు = వచ్చుచుఁ        కడచుచు = కడచుచుఁ

ఈ ఉచు, ఉచుఁ ప్రత్యయములు కన్నడమందున్న ఉతు, ఉతుం ప్రత్యయములవలనఁ బుట్టినవి. తకారమునకు చత్వము. కన్నడమున ఉతు ప్రత్యయమునకు ఉఁ. ప్రత్యయముచేరి ఉతుం ప్రత్యయము వచ్చినట్లు ఉచు ప్రత్యయమునకు ఉఁ ప్రత్యయము చేర్పఁగా ఉచుఁ ప్రత్యయము వచ్చును.

**127.** అదుర్వాదిధాతువులకు ఉచు ప్రత్యయంబు పరంబగుచో దానికిపూర్వమయిన దకారముతోఁ జేరిన యుకారమునకు వైకల్పికముగ లోపము. అయినను దకార రేఫములకు పూర్వమయిన యచ్చు లఘువుగానే యుండును.

ఉ. అదురుచు = అద్రుచు        పదురుచు = పద్రుచు

ఎదురుచు = ఎద్రుచు        విదురుచు = విద్రుచు

"పాదంబులు వెట్టుడుఁ ద
త్పాదప ఘనశాఖ విఱిగి భల్లన నుచ్చై
ర్నాదమున దిక్కు 'లద్రువఁగ'
భేదిల్లె విహంగతతులు భీతింబఱవన్". భార.

"'ఎద్రిచిన' కాలపాశమున నీగతినీమదిఁ గ్రోధవల్లికన్
'విద్రిచిన' వారు లేరు." ఉత్తర హరివం.

"వొంగి విచ్చుపసిఁడి గేదఁగి ఱేకుగ మిమించు
విశదచ్ఛదంబుల 'విద్రిచి విద్రిచి'." పాండు.

**128.** దీనికి మూలప్రత్యయమయిన ఉతు అనునది దీర్ఘాంతముగా గ్రామ్యభాషయందు వచ్చుచున్నది.

ఉ. చేయుతూ = చేస్తూ

వచ్చుతూ = వస్తూ

పోవుతూ = పోతూ
ఆడుతూ కొట్టుతూ
పాడుతూ తిట్టుతూ

**129.** యాంత చాంత ధాతువుల తుదియుకారమునకు లోపము రాఁగా యచలకు సత్త్వము.

ఉ. చేస్తూ, ఇస్తూ, తెస్తూ, వేస్తూ.

**130.** కనుకన్; అఱవమునందు 'కాణుంగాల్' అను పదము దీనికి మూలము.

కాణుంగాల్. కాణుమ్, 'కనుట' 'కనెదు' కాల్ 'కాలమునందు.'

'కనినయెడలన్' 'చూచినయెడలన్' అనియర్థము కాల్ పదము యొక్క లకారమునకు నత్వము ఆకారమునకు హ్రస్వము.

పక్షాంతరము.

కనన్+కాన్=కనకన్.

కనన్ 'కనుట' 'చూచుట.' కాన్ 'కాఁగా' 'చూచుటకాఁగా' అనఁగా చూడఁగా అనియర్థము.

మూఁడవ పక్షము.

దీనికిసరియయిన. అ. కాణల్ అగ అనుపదములు.

కాన్+కాన్=కాఁగా. ఇది కనుకన్ అయియుండవచ్చును.

'కానన్;' అఱవమందు అగుమ్+అల్=అగుమాల్=ఆమాల్, అమ్= 'అగును,' అల్ అన్. అఱ. అయినాల్. 'అయినన్'; ఆమాల్ అఱవము నందు సంభావనార్థకమునందును కారణార్థమందును వచ్చును.

కానన్ అనునది 'కావునన్' అనియునగును.

అగుమ్ అనునది, అకారము గకారమునకు పరముగవచ్చి ఉకారము నకు ఆదేశముకాఁగా, గామ్ అనినిలుచును. గకారమునకు కత్వమును మకార

మునకు వత్వమును రాఁగా కావ్ అయినది. ఇట్లే పక్షాంతరమున. అగుప్ పదము, అకారము గకారమునకు వెనుకను ఉకారమునకు పూర్వమునను రాఁగా, గ్+అ+ఉప్ అనినిలుచును. గకారమునకు కాదేశమును పకారమునకు నాదేశమును అకారమునకును ఉకారమునకును మధ్యమున వకారాగమమునురాఁగా కావును అనిరూపముసిద్ధించును. అన్ అను దానితోఁజేరఁగా కావునన్ అనియగును అన్ 'అయినన్'.అ-అన్.

"'కావున' నేమియుఁజేయం
గాఁదలఁపదు వారికై యకారణకరుణా". భార.
"ఉండుఁ 'గాన' జెప్పకుండరాదు". భార.
"నిక్కమునట్ల 'కాన' దగునీతిపరుల్ సురలంక్కవంబునన్
మిక్కిలియైన వారినియమింపక తక్కుదురే". నిర్వచన.

## ధాతుజన్యనామవిశేషణము.

### భూతార్థకము.

**131.** ధాతువునకు ఇనప్రత్యయమును చేర్చుటచేత భూతార్థక ధాతుజన్యవిశేషణము పుట్టును.

ఉ. వచ్చు + ఇన + వచ్చిన.
తెచ్చు + ఇన + తెచ్చిన.
కొట్టు + ఇన + కొట్టిన.
ఆడు + ఇన + ఆడిన.
పాడు + ఇన + పాడిన.

ఈ ఇనప్రత్యయమె భూతార్థమందువచ్చినది. తెచ్చినాఁడు, తెచ్చినవాఁడు = తెచ్చిన + వాఁడు. వాఁడు పదముయొక్క వకారమునకుఁ బాక్షికముగ లోపమురాఁగా తెచ్చిన+ఆఁడు అనినిలిచి తెచ్చినపదముయొక్క అంత్యాకారమునకు లోపమురాఁగా తెచ్చినాఁడు అనివచ్చినది. (౬౩,౭౭. చూడు)

**132.** యకారాంత ధాతువుల అంత్య యకారమునకు ఇనాగమేకారము రాఁగా సత్వము. (౭౭వ, విధిని చూడుము).

ఉ. వేసిన = వేయు + ఇన.
వ్రాసిన = వ్రాయు + ఇన.
మూసిన = మూయు + ఇన.
చేసిన = చేయు + ఇన.

**133.** అగుపోవుధాతువుల గు వులకు యకారమాదేశమగు.

ఉ. అయిన = అగు + ఇన, అ. ఐన.
పోయిన = పోవు + ఇన, ,, పోయిన.

**134.** పడ్వాదులకు పరమయిన ఇనాగమేకారమునకు లోపమును నకారమునకు పూర్వహల్సవర్ణాదేశమునగు.

ఉ. పడ్డ, పడు; ఇడ్డ, ఇడు; చెడ్డ, చెడు; అన్న, అను;
కన్న, కను; తిన్న, తిను; కొన్న, కొను;
మన్న, మను; విన్న, విను; చన్న, చను;
పడిన = పడు + ఇన = పడ్డ, అ. పట్టి,
చెడిన = చెడు + ఇన = చెడ్డ, అ. కెట్ట,

**135.** ఈధాతుజన్య విశేషణమునకు అన్ ప్రత్యయము చేరఁగా సంభావనార్థ క్రియావిశేషణముపుట్టును. అన్ ప్రత్యయమునకు మూలము అఱవములో అన్.

ఉ. అర. శెయ్దకాల్ / శెయ్దాల్ } 'చేసినకాలమున.' 'చేసినపక్షమున'

కాలవాచకమయిన కాలశబ్దమునకు అంతస్వరలోపమువచ్చి కాల్ అని అయినది. దీనియొక్క క కారమునకు పాక్షికముగ లోపమురాఁగా అల్

అని రూపముసిద్ధించెను ఈ అల్ప్రత్యయముయొక్క లకారమునకు నకారాదేశమును అకారంబునకు హ్రస్వంబును తెనుఁగునవచ్చుటచే అల్ అనునది అన్ అగును.

ఉ. చేసిన + అన్ = చేసినవాఁ.

వచ్చిన + అన్ = వచ్చినవాఁ.

" 'అడిచినఁదిట్టినన్న' అటి మహాపరుషంబులు పల్కుయల్కఁతోఁ
'బొడిచిన' సత్తమద్విజులు పూజ్యులు వారలకెగ్గు 'సేసినం'
జెడుసిహాముంబరంబు నిదిసిద్ధము". భార.

## వర్తమానార్థక ధాతుజన్య నామవిశేషణము.

**136.** ఇది ధాతువునకు చున్న అను ప్రత్యయము చేర్చుట చేత వచ్చును.

ఉ. చేయుచున్న = చేయు + చున్న.
వచ్చుచున్న = వచ్చు + చున్న.
కొట్టుచున్న = కొట్టు + చున్న.
ఆడుచున్న = ఆడు + చున్న.
పాడుచున్న = పాడు + చున్న.

**137.** చున్న ప్రత్యయముయొక్క చకారంబునకు గ్రామ్యంబున తాదేశంబు అగును.

ఉ. కొట్టుతున్న, వండుతున్న, తిట్టుతున్న, ఆడుతున్న, నిండుతున్న, పాడుతున్న.

**138.** ఈ తాదేశంబు ధాతువుల అంత్యచకార యకారములకు పరంబగునపుడు చయలకు సత్వమగును.

ఉ. చేయుచున్న, చేస్తున్న. తెచ్చుచున్న, తెస్తున్న.
వేయుచున్న. వేస్తున్న. పిలుచుచున్న, పిలుస్తున్న.
వచ్చుచున్న, వస్తున్న. వలచుచున్న, వలస్తున్న.

**139.** ఈ క్రియలు కేవలవర్తమానకాలవివక్షయందు ఏకపదములు; సాతత్యవివక్షయందు రెండు పదములు; పూర్వ పదము వర్తమానక్రియా విశేషణము. ఉత్తరపదము ఉండు ధాతువుయొక్క ధాతుజన్య నామవిశేషణము.

ఉ. చేయుచున్న - కేవలవర్తమాన కాలమున ఏకపదము. చేయుచు న్న = చేయుచు+ఉన్న 'కార్యమును ఆరంభించి ఎడతెగకదానిం జేసెడు' అని యర్థము; ఈయర్థమునందు రూపాంతరముగలదు. చేయుచునున్న = చేయుచున్+ఉన్న (సంధిప్ర. చూ.)

భవిష్యదర్థక ధాతుజన్య నామ విశేషణము.

**140.** ఇది ధాతువునకు ఉన్ ప్రత్యయము చేర్చుట చేతఁగలుగును. ఈ ప్రత్యయముయొక్క నకారము అజాది పదము పరమగునపుడుండును. హలాదిపదము పరమగునపుడు లోపించును.

ఉ. వచ్చువాఁడు = వచ్చున్ + వాఁడు = వచ్చువాఁడు.
అ. = వరుమ్ + అవన్ = వరువవన్.
కన్న. = బరువ + అవను = బరువవను.
వచ్చునతఁడు = వచ్చున్ + అతఁడు.

ఈ ఉన్ ప్రత్యయము ఉమ్ అను అఱవప్రత్యయము యొక్క వికృతి. ఈ ఉన్ ఉమ్ ప్రత్యయములు కన్నడములోనుండునట్లు పూర్వమున ఉవ యనురూపము కలిగియుండెను. ఇది యుమూలప్రత్యయము. ఈ ప్రత్యయము

యొక్క తుది అకారమునకు లోపమును వకారమునకు మకారాదేశమును రాఁగా ఆఱవ ప్రత్యయము ఉమ్ సిద్ధించుచున్నది. ఉమ్ ప్రత్యయమునుండి తెనుఁగునకు ఉన్ వచ్చుచున్నది.

భూతవర్తమానకాలములయందు చేయుచున్న చేసిన యని ధాతుజన్య విశేషణములు అకారాంతములై యుండఁగా భవిష్యత్తునందు అకారము లేక యుండుట విశేషము. దీనికిఁ గారణమును పైఁ జెప్పిన విధమున నెఱుంగునది.

ఉ. వచ్చున్, తెచ్చున్, కొట్టున్, తిట్టున్, వ్రాయున్, వేయున్, చేయున్.

**141.** ఈ ఉన్ ప్రత్యయము ఉ అను అంత ప్రత్యయమును దానికి పూర్వమున డ్ అను ఆగమమును పొంది ఉండు అగును.

అఱవమునందు ఇట్లే ఉమ్ అనునది ఉండు అగును.

కూప్పెయర్క్కుండు నీర్ కోటి.

కూను వెల్లగించెడు నీరుకోడి 'కూను=భూమిని'; ఈరూపము ప్రాచీన ద్రవిడ గ్రంథములయందు కనఁబడును.

ఈ ఉండు ప్రత్యయము తెనుఁగున ఎడి అనివికృతమగును. దానికి ఉన్ అను నిరర్థక ప్రత్యయమును చేర్పఁగా ఎడున్ అను ప్రత్యయము పుట్టును. ఈ ఎడున్ ఎడి ప్రత్యయములను ధాతువులకుఁ జేర్పఁ గ్రొత్తఁగా రెండు భవిష్యదర్థక విశేషణములు పుట్టును. సముచ్చయార్థకమయిన ఉన్ అను అవ్యయము ఇక్కడ అర్థము లేక ప్రత్యయమయినది.

ఉ. కొట్టెడున్ = కొట్టు + ఎడున్.

కొట్టెడి = కొట్టు + ఎడి.

ఇట్లు తిట్టెడు, తిట్టెడి, తిట్టు; ఆడెడుఁగా, ఆడెడి, ఆడు; పాడెడుఁగా, పాడెడి, పాడు. ఇట్లేభవిష్యదర్థక పూర్ణక్రియలయిన ఆడుఁగా, పాడుఁగా, మొదలయినవి ఆడెడిని, ఆడెడును, పాడెడిని, పాడెడును, అనివచ్చుటను చూడుము. (౭౬–వ వి. చూడుము.)

**142.** ఈ ప్రత్యయముయొక్క ఆదియందున్న ఎకారము చేత ధాత్వంతయకారమునకు సత్వము.

ఉ. వేసెడుఁగా = వేయు + ఎడుఁగా.

వేసెడి = వేయు + ఎడి.

ఇట్లు చేసెడుఁగా, చేసెడి మొదలయినవి.

**143.** పైఁజెప్పిన ఎడిఁగా ప్రత్యయముయొక్క డకారమునకు టత్వమును ఎకారమునకు దీర్ఘమును రాఁగా ఏటి అను ప్రత్యయమువచ్చును. ఈ ప్రత్యయముయొక్క టికారమునకు లోపమురాఁగా ఏ అను ప్రత్యయమువచ్చును.

ఉ. చేసేటి, చేసే, వేసేటి, వేసే, కొట్టేటి, కొట్టే.

ఈ రూపములు తఱుచుగా గ్రామ్యంబునందు వచ్చును.

దాఁటేవాఁడు.

"అంతర్వాణి కుశేశయద్యుమణిఁ బద్మాక్షున్మదిన్నిల్పిదు
ర్దాంతానంతభవాంధ కూపతరణి పొందిఁగా దృఢస్థేముఁడై
టింతుర్పద్దులు తద్దనమ్మినయి 'దాఁటేవానికిఁగా' చింతయా
కంత్రైనం గడమేనియుం గడమగాదాయుంచు నూహించుచుఁగా."

పాండురంగ.

వ్యతిరేకక్రియలు; పూర్ణక్రియలు.

**144.** క్రియాజన్యనామవిశేషణము సర్వనామములతో

సమసించి యేకపదమగుటచే పూర్ణభావక్రియలు సిద్ధించునట్లు పూర్ణాభావక్రియలును పుట్టుచున్నవి.

ఉ. చేయనివాఁడు } చేయని+వాఁడు.
చేయఁడు

మొదటి రూపము సమస్తమైనప్పటికిని సంక్షేపమును బొందలేదు. రెండవదానియందు సంక్షేపము గలిగియున్నది. వాఁడు అను ప్రత్యయము భావాభావ క్రియలకు సామాన్యము. దానికి పూర్వమందుండు విశేషణములలో భేదము కలుగుచున్నది.

ఉ. చేయువాఁడు, చేసినవాఁడు, చేయుచున్నవాఁడు, ఇట్లు కాలత్రయమునందును వచ్చెడు క్రియలందు పూర్వమఁలయిన చేయుఁ, చేయుచున్న, చేసిన అను పదములు భావార్థకధాతుజన్య నామవిశేషణములు; చేయనివాఁడు అనుదానియందు చేయని అనునది పైఁజెప్పిన విశేషణములకు వ్యతిరేక రూపము.

**145.** వ్యతిరేక క్రియలకు సామాన్యవిధి. భావక్రియలలో కాలవాచకాగమముయొక్క హల్లునకును ప్రత్యయహల్లునకును పూర్వమున అకారాగమమునుంచిన వ్యతిరేకరూపములు కలుగును. ఆ హల్లునకు పూర్వమందుండు ఇకారోకారములకును ధాత్వంత్య ఓకారమునకును లోపము కాఁగా వానిస్థానమందు ఈ అకారమును ఉంచవలయు. భావరూపము వికృతమయి యుండిన యెడల అవికృతమయిన దాని మూలరూపమును గ్రహింప వలయు. ఈ వ్యతిరేక ప్రత్యయమయిన అకారమునకు మూలము అటువ

మందుండు ఆ ప్రత్యయము. దానిస్థానమునఁ గన్నడమందు అ కారము వచ్చును.

ఉ. శెయ్దు = శెయ్యాద.

గెయ్దు = గెయ్యాద.

అఱవములో శెయ్యాద అనునది శెయ్యా అని దకారలోపముతో వచ్చును. ఈ తీరుననే శెయ్యాదవన్ అనునది శెయ్యాన్ అని సంక్షిప్తమగును. ఈరూపము తెనుంగున శేయఁడు అనియు కన్నడమునందు గెయ్యను అనియుం వచ్చును. ఇది భూతార్థకము. గండన్ గండఁడు, మిండన్ మిండఁడు, అయినట్లు శెయ్యాన్ చేయఁడు అయినది. ఈ పదము లన్నింటి యందును అంతమందుండు ప్రత్యయములు అన్ అండు అనునవి. అఱవ ప్రత్యయమైన అన్ తెనుఁగునందు అండు అయిన వివరము ప్రత్యయముల క్రింద చూడవచ్చును. భవిష్యత్తునందును వర్తమానార్థమునందును వచ్చునట్టి అఱవము శెయ్యామ్ అనునది కన్నడమందుండు గెయ్యెవ అనుదాని వికృతి. ఈ గెయ్యెవ అనునదియుం గెయ్యెద అను ప్రాచీనరూపమునుండి వచ్చినది. అఱవము శెయ్యెమ్ అను భావక్రియనుండి దానికి ఎదురయిన వ్యతిరేక క్రియను సాధించుటకు దాని అవికృతమయిన మూలరూపమును గ్రహింపవలయు. అదియే శెయ్యెద అనునది. దీనినుండి అఱవమునందు వర్తమానభవిష్యత్కాలములలో శెయ్యాద అను వ్యతిరేక క్రియ వచ్చినది. శెయ్యాద శెయ్యా అని సంక్షిప్తమగును. అట్లె శెయ్యాదవన్ శెయ్యాన్ అని సంక్షిప్తమగును. శెయ్యాద శెయ్యా అను ధాతుజన్య నామవిశేషణములును వానికి అవన్ అను సర్వనామము చేర్చుటచేఁ బుట్టిన శెయ్యాదవన్ శెయ్యాన్ అను వ్యతిరేక క్రియలును భవిష్యత్కాలమునందును వచ్చును. పైఁజెప్పిన విధమున ద్రవిడమందు శెయ్యాన్ అనునది త్రికాలములయందును వచ్చెడు వ్యతిరేక క్రియ అయినది. ఇట్లే ఇతర పురుషలింగవచనములందును శెయ్యాళ్ శెయ్యాదు

కొందలయినవి వచ్చినవి. కన్నడ క్రియలును తెనుఁగు క్రియలును వాని నుండి పుట్టును.

| తె. | కన్న. | అఱ. | |
|---|---|---|---|
| ఉ. చేయఁడు | గెయ్యను | శెయ్యాన్ | |
| చేయదు | గెయ్యదు | శెయ్యాళ్ | |
| చేయరు | గెయ్యరు | శెయ్యార్ | |
| చేయదు | గెయ్యదు | శెయ్యాదు | |
| చేయవు | గెయ్యవు | శెయ్యా | (శెయ్యావ. వ |
| చేయవు | గెయ్యయ్ | శెయ్యాయ్ | లోపము) |
| చేయరు | గెయ్యరి | శెయ్యీర్ | |
| చేయను | గెయ్యెను | శెయ్యేన్ | |
| చేయము | గెయ్యెవు | శెయ్యేమ్ | |

ఈ క్రియలకు నామములుగాను ప్రయోగముగలదు.

ఉ. వాఁడురాఁడయ్యె, వారురారయిరి, అదిరాదయ్యె, అవిరావయ్యె.

**146**. భూతార్థకధాతుజన్య వ్యతిరేకనామ విశేషణము చేయని ; ఈరూపముచేసిన అనుదానికి వ్యతిరేకము.

పైఁజెప్పిన వ్యతిరేక క్రియయొక్క సామాన్యవిధిచేత వ్యతిరేకప్రత్యయమయిన అకారమును నకారమునకు పూర్వమందుండునట్టి ఇకారమును ఎత్తివేసి దాని చోటనుంచిన, చేయ్+అ+న అని నిలుచును. యకారమునకు సకారము ఆదేశమయి వచ్చుటకు కారణమైన ఇకారముపోఁగా కార్యమయిన సకారమునుపోవును. కాఁబట్టి చేయ్+అ+న=చేయన అనిరూపమువచ్చును, చేసిన అనుభావ క్రియయందుండు ఇకారము సామ్యన్యా

యము చేత చేయన అను క్రియయొక్క తుదియకారమునకు ఆదేశము కాఁగా చేయని అనిరూపము సిద్ధించుచున్నది. చేసిన అనుభావక్రియయందలి యికారము చేయన అను ప్రతిషేధక్రియ యందుపైఁజెప్పిన న్యాయముచేతఁ బ్రాప్తముకాఁగా, అది చేయన అను క్రియయందు ఎచ్చటనుండవలయు అని శంకవచ్చుచున్నది. చేయను అను క్రియలో రెండవ అక్షరమునందు అభావార్థక ప్రత్యయమయిన అకారముండుట ఆవశ్యకమగుటచే అక్కడ ఇకారముండఁగూడదు. కాఁబట్టి మూఁడవ అక్షరమయిన నకారములో అకారమునకు ఆదేశమయినది.

ఈవిధిచేత చేయని అనునది భూతార్థకము వ్యతిరేకక్రియ. చేయక అనుభవిష్యద్వర్తమానార్థక భావవిశేషణమున నకారమునకు పూర్వముండునట్టి ఉకారముయొక్క స్థానములో అభావవాచకమయిన అకారముసుంచిన చేయక అనినిలుచుచున్నది. పైఁజెప్పిన భూతార్థకమైన చేయన అనుదానియొక్క తుదలో ఇకారమునుంచినట్లు చేయక అనుదానియొక్క అంతమునందు ఇకారమును ఉంచిన చేయని అనివచ్చును. ఇట్లు చేయని అనువ్యతిరేకనామ విశేషణము మూఁడుకాలములందును వచ్చినది.

| | |
|---|---|
| కనని కానని | చూడని |
| అనని నాని | వలవని ఒల్లని |
| పోని పోవని | పిలువని పిలని |
| లేని లేరని | లేని (ఇలని) |
| రాని (వరని) | కొట్టని |
| కాని (అగని) | తిట్టని |
| నేరువని నేరని | అడని |
| తేరని తేని | పాడని |

| | |
|---|---|
| ఈయని ఈని | వేయని |
| చూరని | తీయని |
| నోవని నోని | వ్రాయని |

**147.** వర్తమానార్థక ధాతుజన్యనామవిశేషణము.

చేయుత ప్రాచీనభావ రూపము.

చేయుచున్న వెనుకటిభావ రూపము.

వ్యతిరేక క్రియా సామాన్య సూత్రమున విధింపఁబడిన అకారాగమమును చేయుత పదముయొక్క తకారమునకు ముందున్న ఉకారముయొక్క స్థానములోనుంచిన, చేయ్+అ+త అనినిలుచును. తకారమునకు చకారము ఆదేశము కాఁగా చేయ్+అ+చ అనినిలుచును. ఇచ్చట చకారమునకు కకారాదేశము కాఁగా చేయక అనురూపము సిద్ధించును. దీనికి సమాసమునందు మునుపు, తొల్లి, ముందు, మున్ను శబ్దములు పరంబగునపుడు మాత్రము ప్రయోగము.

ఉ. చేయక మునుపు.
చేయక తొల్లి.
చేయక ముందు.
చేయక మున్ను.

ఇచ్చట చేయక అను దానిని భావనామముగా కొందఱు గ్రహించి కకారమును కజ ప్రత్యయమని చెప్పిరి. అది యుక్తముకాదు.

చేయకమునుపు
చేసినవెనుక } ఈ రెండుశబ్దములు ప్రతిభాగమునను సమమయి వచ్చినవి.

చేయక, చేసిన ఈరెండు పదములు ఏకరూపములయినవి. చేయక అనునది భావార్థకమందువచ్చిన నామము అని చెప్పినయెడల, చేసిన అనుపదమును అట్లే యుండవలయును. దీనినిమాత్రము ధాతుజన్యవ్యతిరేకవిశేషణ

ముగా గ్రహించి చేయక పదమును భావార్థమందువచ్చిన నామమని యెట్లు చెప్పవచ్చును? అదియటులుండగా చేయక పదములో యకారముతో జేరిన అకారమెందుకు వచ్చినది? భావార్థమందు క ప్రత్యయమును చేర్చుటచేత రాక, పోక, నడక అనురూపములువచ్చునపుడు, క ప్రత్యయమునకు మునుపు అకారములేదు. అకారముండినయెడల పోక అనునది పోవక అనియు నడక అనునది నడవక అనియు రావలయును, అట్లురావు.

అటుల కన్నడమునందు చేయకమునుపు అనుపదమునకు సరియయినవి, అ. కెయ్యాదమున్ను. క. గెయ్యదముందు. ఇచ్చటపూర్వమునసుందు కెయ్యాద, గెయ్యద అను పదములను ధాతుజన్య విశేషణములని ఆ యాభాషను తెలిసిన వైయాకరణులుచెప్పుదురు. ఆంధ్రభాషావైయాకరణులు మాత్రము స్వరూపమునకు విరుద్ధముగా కెయ్యాద, గెయ్యద పదములకు సరియయిన చేయక అను పదమును భావనామమని చెప్పుట శాస్త్రవిరుద్ధము.

## విశేషరూపములు.

ఉ.

| | |
|---|---|
| చావక / చాక | నేరవక / నేరక |
| నోవక / నోక | తేరక / తేక |
| అనక / నాక | ఈయక / ఈక |
| పోవక / పోక | చూరక / చూడక |
| పిలువక / పిలక | నిలువక / నిలక |

ఈ క్రియలను ధాతుజన్యవ్యతిరేక క్రియావిశేషణములను ఏక రూపము లుగానుండును.

**148**. ధాతుజన్యక్రియావిశేషణము; భూతము.

ద్రవిడమునందు ఉకారాంతధాతువులకు భావార్థకధాతుజన్యక్రియావిశేషణము ఇకారాంతమయియుండును. దీని వ్యతిరేకరూపములను సాధించుటకు దీనిమూలరూపమును గ్రహింపవలయును. దీనికి మూలరూపము ధాతుజన్యక్రియావిశేషణప్రకరణమునఁజెప్పిన ప్రకారము ఆడిదు అనునది.

ఇచ్చట దకారమునకు పూర్వమున ఇకారస్థానములో వ్యతిరేకాగమమును ఉంచిన ఆడదు అని రూపమువచ్చు; అ. ఆడాదు. ఈరూపమునకు కన్నడమునందును నిరర్థక ప్రత్యయమైన ఎకారము చేర్పఁగా ఆడదె అని వచ్చునట్లు తెనుఁగున అకారమును నిరర్థక ప్రత్యయముగాఁజేర్చి దకారమునకు చకారాదేశమును చకారమునకు కకారాదేశమును చేయఁగా ఆడక అని వచ్చును. ఈ క్రియయొక్క విశేషరూపములు క్రిందఁజెప్పఁబడిన వానివంటివి.

**149**. భావమునందు క ప్రత్యయాంత భావనామము ప్రేరణాద్యర్థమునందు పూర్ణక్రియగా వచ్చునట్లు వ్యతిరేకమునందును వచ్చును.

ఉ. కొట్టక, తిట్టక, రాక, పోక, వ్రాయక. అ-కొట్టక్క, తిట్టక్క, వరక్క, పోవక్క, వరైయక్క, వీనికి గ్రామ్యమునందే ప్రయోగము.

ఈ క్రియలకు మధ్యమపురుష ప్రత్యయములు ఉము, ఉండు, ఉవె, ఉరె చేరి వచ్చును.

ఉ. కొట్టక + ఉము = కొట్టకుము.
కొట్టక + ఉండు = కొట్టకుండు.
కొట్టక + ఉవె = కొట్టకువె.
కొట్టక + ఉరె = కొట్టకురె.

ఉము ప్రత్యయముయొక్క ము కారములోపింపఁగా ఉ ప్రత్యయము వచ్చును. అది క ప్రత్యయాంత భావనామములకు తుదినిరాఁగా ప్రార్థనాద్యర్థమునందు మధ్యమపురుషైకవచన క్రియవచ్చును. ఉ. కొట్టకు, తిట్టకు, చేయకు, రాకు, పోకు.

ఉము ఉండు ప్రత్యయములకు అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ ప్రత్యయములు అనుప్రయుక్తంబులగు.

ఉ. చేయఁకుము, చేయకుమా, చేయకుమి, చేయకుమీ.

"ఆక్లేశవృత్తిరాజ్యము గలిగిన వారేల యిత్తురు నీకుఁ బాలు 'చెప్పుమా'" భార. "అనఘా వినవలతుం 'జెప్పుమా.'" ఉత్తరహరి, [భార.

'ఏలకుమీ' కసుగాయలు
'దూలకుమీ' బంధుజనుల దోషము సుమ్మీ
'పాలకుమీ' రణమందును
'మీలకుమీ' గురువులాజ్ఞ మేదిని సుమతీ."

"తగవించుక తప్పకచొప్ప 'చెప్పుమా'" భా. రా.

| | | | | |
|---|---|---|---|---|
| చూడుమీ | అనునది | చుమ్మీ | చుమీ | అనియు, |
| చూడుమా | ,, | చుమ్మా | చుమా | ,, |
| చూడుమ | ,, | చుమ్మ | చుమ | ,, |

వచ్చును. ఇట్లె ఉండు ప్రత్యయమునకు ఉదాహరణముల దెలియునది.

**150.** అవు, అరు ప్రత్యయాంతములయిన మధ్యమ పురుష వ్యతిరేక క్రియలు ప్రశ్నార్థకమయిన ఏకారముతోఁగూడి ప్రేరణార్థకముగా వచ్చును.

ఉ. వినవే = వినవు + ఏ. నీవువినవా?
వినరే = వినరు + ఏ. మీరువినరా?
అని శబ్దార్థము.

చేసిన ప్రశ్నమునకు వినుటయందు ప్రవృత్తిని గలుగఁజేయుటయే తాత్పర్యము అగుటచే వినుము వినుండు అని ప్రయోగార్థము.

## కర్మణి ప్రయోగము.

**151** అన్నంతములైన భావనామములు పడుధాతువులతోఁజేరి అధికరణార్థమునందుఁ బ్రయోగింపఁబడును. అప్పుడు సంధికార్యముచేత నకారమునకు పూర్ణార్ధానుస్వారములు నిత్యాదేశంబులగు. అధికరణము ఆధారము.

ఉ. చేయంబడుచున్నాఁడు.
చేయఁబడుచున్నాఁడు.
చేయనుబడుచున్నాఁడు } అనిష్టత్వ సంశ్లేషంబులు లేవు.
చేయన్పడుచున్నాఁడు }

ఇక్కడ పడు అనుక్రియకు చేయుట అనుభావనామము కర్త. పడుట 'ఉత్పత్తియగుట.' ఈకర్తకు పడుక్రియతో నిత్యసమాసము రాఁగా చేయఁబడు అనుశబ్దపల్లవధాతువు పుట్టును. ఈసమస్తక్రియ చేయుట కర్తగాఁ గలిగిన పడుట అనుకార్యమునకు ఆధారమైయున్న దేవదత్తుఁడు కొందరయిన కర్తతోఁ బ్రయోగింపఁబడుచున్నది.

దేవదత్తునియందు చేయుట (చేయుట) పడును ఉత్పత్తియగును.

చేయుట పడు అనుపదములను ఒకటిగా గ్రహించి చేయుట పడుటకు ఆధారమయిన దేవదత్తుఁడు అనుపదమును కర్తఁగాఁజేసి ప్రయోగించిన యెడలఁ గర్మణి ప్రయోగము సిద్ధించుచున్నది. ఈకర్మార్థకమయిన చేయఁబడు ధాతువుయొక్క రూపములు పడు ధాతువుయొక్క రూపములే.

ప్రయోగములందు పడు ధాతువునకు పూర్వమునకన్ అను భావనామము వచ్చును; వచ్చినను అర్థభేదము లేదు.

'వినఁగఁబడిరి'. = వినన్ + కాన్ + పడిరి. 'వినఁబడిరి' యనియె అర్థము.

వినఁగఁబడి అనుదానికి వినఁగఁబడు అనునది ధాతువు. ఇది కొందఱియందు వినక్ కాన్ పడెను అనువాక్యమునందు, వినక్ కాన్పడు పదములను ఒకధాతువుగా గ్రహించి దానిని అధికరణార్థమునందు ఉపయోగింపఁగా కొందఱు వినఁగఁబడిరి, అని భూతకాలమునందువచ్చినది.

" బుద్ధిమంతుఁడు గావున వృద్ధతాప
సోక్తులకుఁ బ్రక్క దౌర్జన్యమూడిగి మెలఁగె
నతఁడుతనలా వెఱుంగనికతన మఱియుం
బీరులనఁగొంద ఱిమ్మహి 'వినఁగఁబడిరి'." నిర్వచన.

## 152. ప్రయోజకార్థము.

దేవదత్తుఁడు కార్యమును చేయుచున్నాఁడు,
యజ్ఞదత్తుఁడు దేవదత్తునిచేతఁ గార్యమును చేయించుచున్నాఁడు.

కాఁబట్టి యజ్ఞదత్తుఁడు ప్రయోజకుండు; ప్రయోజకుండనఁగా ఒకకార్యమును వేఱొకనిచే చేయించువాఁడు.

ప్రయోజకార్థమందు ప్రయోగింపఁబడు ధాతువులకు తుదిని ఇంచ్వాగమమువచ్చును.

ఉ. చేయించు, వేయించు, కొట్టించు, కట్టించు. ఇంచుయొక్క ఇకారానుస్వరములు లోపింపఁగా, చు అగును. (అ. తు. కన. ను.)

ఉ. చేర్చు = చేరు + చు. — అ. చేర్తు. క. చేరిను.
కూర్చు = కూడు + చు. — అ. కూర్తు. క. కూడిను.
పఱచు = పడు + చు. — అ. పడుత్తు. క. పడిను.

**153.** పు ప్రత్యయము కొన్ని ధాతువులకు ప్రయోజకార్థము నందువచ్చును. ధాత్వంత చ య ల కు పు ప్రత్యయముపరమగుచో లోపము.

ఉ. నడపు = నడచు + పు. ఆ. నడత్తు.
కలపు = కలచు + పు. ,, కల్పు.
లేపు = లేచు + పు. ,, ఎలుప్పు.
తెలుపు = తెలియు + పు. ,, తెరివి.

**154.** ధాతువుయొక్క అంత్యవర్ణమునకు పూర్వము యైన ఇకారమునకు పుచు ప్రత్యయములు పరమగుచో వర్ణసమీకరణ విధిచేత ఉత్వము కును.

ఉ. తెలుపు = తెలియు + పు = తెలి + పు.
కలుపు = కలియు + పు = కలి + పు.
తడుపు = తడియు + పు = తడి + పు.
పడుచు = పడియు + పు = పడి + చు.
బిగుచు = బిగియు + చు = బిగి + చు.
మెలుచు = మెలియు + చు = మెలి + చు.
నలుచు } = నలియు + చు = నలి + చు.
నలుపు }

**155.** ప్రేరణార్థకము యైన ఇంచు పరంబగునపుడు పూర్వచకారమునకుపాదేశంబు,

ఉ. పఠింపించు = పఠించు + ఇంచు. ఆ. పడిప్పి.
వచింపించు = వచించు + ఇంచు. ,, వచిప్పి.
గణింపించు = గణించు + ఇంచు. ,, గణిప్పి.
పిలిపించు = పిలుచు + ఇంచు. ,, విళిప్పి.
పలపించు = పలచు + ఇంచు. ,,

**156.** క్రిందవచ్చునవి ప్రయోజకార్థంబు నందువచ్చు విశేషరూపంబులు.

ఉ. అడఁగు. అడఁచు, అడగించు. ,,
ఆఁగు, ఆఁచు, ఆఁపు, అఁగించు.
ఉడుగు, ఉడుపు, ఉడిగించు.
కరఁగు, కరఁచు, కరఁగించు.
కుదురు, కుదుర్చు, కుదిరించు. కుదురుచు
చినుఁగు, చించు. చింపు.
చెడు, చెఱుచు, చెఱుపు.
డిగు, డిగించు, డించు.
తిను, తినిపించు.
తిరుగు, త్రిప్పు.
తునుఁగు, త్రుంచు.
తేలు, తేలుచు, తేలించు.
త్రెగు, త్రెంచు, త్రెంపు.
నలఁగు, నలఁచు, నలఁగించు.
నిలుచు, నిలుపు, నిలువరించు.
పడు, పఱచు.
పాయు, పాచు, పాపు.
పూను, పూనుచు.
పెరుగు, పెనుచు, పెంచు.
బిగియు, బిగుచు, బిగియించు.
మను, మనుచు, మనుపు.
మాను, మానుచు, మానుపు, మానించు, మానింపించు.

మాయు, మాపు, మాయించు.

మునుగు, ముంచు, ముంచు.

మేయు, మేపు.

మెచ్చు, మెచ్చించు, మెప్పించు.

వడియు, వడుచు.

రేగు, రేచు, రేపు, రేగించు.

వెలువడు, వెలువరించు, వెలువఱుచు,

విను, వినుచు, వినిపించు.

విఱుగు, విఱుచు.

భావనామములు.

**157.** ధాతువునకు భావార్థమునందు క, ప, ఇక, ఇకి, ఉట, త, మి, వు, అది, ఉడు ప్రత్యయములగు.

**158.** కకారమునకు పూర్వముయిన ధాత్వంత గ చ య వ లకులోపము.

ఉ. ఆఁక ఆఁగు. మలఁక మలఁగు.

అలుక అలుగు. మునుఁక మునుఁగు.

ఎఱుక ఎఱుగు. మూఁక మూఁగు.

కలఁక కలుగు. వంక వంగు. వీనియందు గలోపము.

కాఁక, కాఁగు. నడక నడుచు.

వీఁక వీఁగు. రాఁక వచ్చు.

మొలక మొలచు. వీనియందు చలోపము.

పోక పోవు. వలోపము.

ముదుక ముదియు. కినుక కినియు. యలోపము

**159.** క ప్రత్యయమునకు వకారాదేశము రాఁగా వప్రత్యయము పుట్టును. ఇది గు, ంగు, అంతంబయిన కొన్ని ధాతువులకగును. ధాత్వంత గకారమునకు కాదేశము.

ఉ. అడఁకువ. అడంగు. అ. అడంగు౯
ఎఱుకువ. ఎఱుఁగు.
నలఁకువ. నలఁగు.
పెనఁకువ. పెనఁగు. అ. పిణంగు౯
లొఁకువ. లొఁగు.
వేకువ. వేగు.
మెలఁకువ. మెలఁగు.
కలఁకువ. కలఁగు. అ. కలంగు౯.

**160.** పైఁజెప్పినక ప్రత్యయము ఇకారాగమముతోఁ జేరి అంజ్యాదులకగు.

ఉ. అంజిక, అంజు. అరయిక, అరయు. అడిక, అడు.
అమరిక, అమరు. ఒనరిక, ఒనరు. ఓడిక, ఓడు.
ఓపిక, ఓపు. కానిక, కను. కూడిక, కూడు.
కోరిక, కోరు. పొందిక, పొందు. పోలిక, పోలు.
తూనిక, తూఁగు. అనిక, అను. పూనిక, పూను.

**161.** ఇకి ప్రత్యయము కోర్యాదులకువచ్చును (అ. ఇకై ప్రత్యయము.)

ఉ. కోరికి, కోరు. పూనికి, పూను. పోలికి, పోలు. మనికి, మను. వినికి, విను. చూడికి, చూడు.

**162.** ఉట ప్రత్యయము అన్ని ధాతువులకును భావార్థంబునందగు.

**163.** ఊట ప్రత్యయము ధాతువునకు పరంబగునపుడు ప్రత్యయోకారమునకును ధాత్వంత డ ర ఱ ల కును లోపము బహుళంబుగ నగును.

| | | |
|---|---|---|
| ఉ. చేయుట, | | చేయు. |
| వచ్చుట, | | వచ్చు. |
| ఉండుట, | ఉంట; | ఉండు. |
| ఆడుట, | ఆట; | ఆడు. |
| పాడుట, | పాట; | పాడు. |
| ఊరుట, | ఊట; | ఊరు. |
| ఏఁకరుట, | ఏఁకట; | ఏఁకరు. |
| ఓడుట, | ఓట; | ఓడు. |
| తేరుట. | తేట; | తేరు. |
| త్రిమ్మరుట, | త్రిమ్మట; | త్రిమ్మరు. |
| వేసరుట, | వేసట; | వేసరు. |

**164.** ధాత్వంతములయిన యకారమునకును చకారమునకును త ప్రత్యయముపరమగుచో లోపము. లుప్తయకారస్థానములో నర్ధానుస్వారంబగు.

| | | |
|---|---|---|
| ఉ. చేఁత, చేయు. | గీఁత, గీయు | మూఁత, మూయు. |
| వేఁత, వేయు. | నేఁత, నేయు. | రోఁత, రోయు. |
| అలఁత, అలయు. | పూఁత, పూయు. | మ్రోఁత, మ్రోయు. |
| కూఁత, కూయు. | పోఁత, పోయు. | వ్రాఁత, వ్రాయు. |
| లాఁత, లాయు. | ప్రేఁత, ప్రేయు. | అవులింత, అవులించు. |
| ఇగిలింత, ఇగిలించు. | ఓకలింత, ఓకలించు. | కుళ్లగింత, కుళ్లగించు. |

కుసిలింత, కుసిలించు. కొక్కిరింత, కొక్కిరించు. కొప్పరింత, కొప్పరించు. గిలిగింత, గిలిగించు. చిగిరింత, చిగిరించు, కౌఁగిలింత, కౌఁగిలించు.

**165.** మిప్రత్యయము (అ. మై. కన్న. మె) కలుగ్వాదులకగు. దీనికిముందు ఇకారాగమంబగు.

ఉ. కలిమి, ఓరిమి, తూరిమి, నేరిమి, ప్రేలిమి, బ్రదిమి, ఒడ్డిమి, తాలిమి.

**166.** అన్ని ధాతువుల వలనఁబుట్టిన వికృతమయిన వ్యతిరేక నామ విశేషణమునకు మిప్రత్యయము చేరుటవలన వ్యతిరేక భావనామములు పుట్టును.

ధాతుజన్య వ్యతిరేక నామ విశేషణములు.

| | | | | |
|---|---|---|---|---|
| ఉ. చేయని, | అ. | శెయ్యాద; | క. | గెయ్యద |
| పోవని, | ,, | పోగాద; | ,, | పోగద |
| తేరని, | ,, | తరాద; | ,, | తారద |
| రాని, | ,, | వరాద; | ,, | బారద |

ఇవి మొదలయినవి అంత్యవర్ణలోపముచే,

| | | |
|---|---|---|
| చేయ, | అ. | శెయ్యా; |
| పో, | ,, | పోగా; |
| తే | ,, | తరా; |
| రా, | ,, | వరా, అనివచ్చును. |

వీనికి తెనుఁగున మిప్రత్యయమును అఱవమున మైప్రత్యయమును చేరఁగా.

| | | |
|---|---|---|
| చేయమి, | అ. | శెయ్యామై; |
| పోమి, | ,, | పోగామై; |

రామి, ,, వరామైః
తేమి, ,, తరామైః

అను భావనామంబులు బుట్టును.

**167.** చేయు, పో, తే, రా. మొదలయిన వ్యతిరేక నామవిశేషణములు తెనుంగున లేవు. వానికి సమానమయిన, శెయ్యా మొదలయిన రూపములు అఱవమునందుఁ గలవు. కాఁబట్టి మై ప్రత్యయాంతములయిన ఱఱవభావనామములు తెనుంగునందు చేయమి, పోమి, తేమి, రామి అని వికృతముల యినవియని తెలిసికొనవలయు.

**168.** వు ప్రత్యయము మున్నాదులకగు.

ఉ. మనువు—మను. తడవు—తడయు.
కావు —కాచు. నిలువు—నిలుచు.
కొలువు—కొలుచు. నోవు —నొచ్చు.

**169.** అదు ప్రత్యయము ఉవాగమాంతంబయిన ధాతు జన్యవిశేషణమునకుఁ జేర్పఁగా భవిష్య దర్థకభావనామము అఱవంబునందును కన్నడమునందును బుట్టును. వర్ణసమీకరణ విధిచే దుకారమునకు పూర్వమయిన అకారము ఉకారము కాఁగా కన్నడమందు వేఱొకభావ నామముపుట్టును.

ఉ. అ. అఱువదు. క. అఱువుదు. ఈ కన్నడ క్రియయందు వకార లోపమును దకారమునకు డత్వాదేశంబును చేసినయెడల అఱుదు అనియగును. అఱుదు=అఱు+ఉదు.

ఇట్లు అమ్ము మొదలయిన ధాతువులకు ఉదు ప్రత్యయము వచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఉ. ఆఱుడు, | ఆఱు. | దంపుడు, | దంచు. |
| అమ్ముడు, | అమ్ము. | దిగుడు, | దిగు. |
| అల్లుడు, | అల్లు. | దోఁపుడు, | దోఁచు. |
| ఎక్కుడు, | ఎక్కు. | పెంపుడు, | పెంచు. |
| క్రమ్ముడు, | క్రమ్ము. | ప్రాఁకుడు, | ప్రాఁకు |
| చోఁపుడు, | చోఁపు. | మాపుడు, | మాయు. |
| త్రోపుడు, | త్రోచు. | రాపుడు, | రాచు. |
| త్రొక్కుడు, | త్రొక్కు. | వేఁపుడు, | వేఁచు. |

**170**. ఈభావనామమె సముచ్చయార్థకమయిన ఉన్ అను అవ్యయముతోఁజేరి అనంతరార్థమునందు వచ్చును. (౧౨౩-వ వి. చూడుము.)

**171**. అది ప్రత్యయము ధాతుజన్య విశేషణములకుఁ జేర్పఁగా భావ నామములు పుట్టును.

| | | |
|---|---|---|
| ఉ. వచ్చునది. | తెచ్చుచున్నది. | పోయినది. |
| వచ్చుచున్నది. | తెచ్చినది. | రానిది. |
| వచ్చినది. | పోవునది. | లేనిది. |
| తెచ్చునది. | పోవుచున్నది. | పోనిది. |

**172**. అది ప్రత్యయాంతమయిన భవిష్యదర్థక భావ నామము విధ్యర్థమందు వచ్చును. (౧౦౫-వ వి. చూడుము)

**173**. కాలత్రయమందును వచ్చెడు ధాతుజన్యవిశేషణములతోఁ వాఁడు, వారు మొదలయిన ప్రత్యయములు చేరిన యెడల కర్త్రర్థక నామములు అగును.

ఉ. వచ్చువాఁడు.

వచ్చినవాఁడు. వచ్చినాఁడు.

వచ్చుచున్నవాఁడు. వచ్చువాఁడు.

వచ్చునది, వచ్చినది, వచ్చుచున్నది. స్త్రీ.

వచ్చువారు, వచ్చినవారు, వచ్చుచున్నవారు.

వచ్చునది, వచ్చినది, వచ్చుచున్నది.

వచ్చునవి, వచ్చినవి, వచ్చుచున్నవి.

కారక క్రియలు.

**174.** నామములతో నుత్తమ మధ్యమ పురుషసర్వనామములు సమస్తములయి ప్రత్యయత్వమును బొంది వాక్యమునందుఁ క్రియలుగావచ్చును.

ఉ. మంచివాఁడు + ఈవు = మంచివాఁడవు. ఈవు అనుసర్వనామము అవుఅయి ప్రత్యయత్వమునుబొందె.

మంచివారు + ఈరు = మంచివారరు. ఈరు అరుఅయినది. సర్వనామమునకు ప్రత్యయత్వము పైఁజెప్పినట్లు.

మంచివాఁడు + ఏను = మంచివాఁడను. ఏను అనుఅయినది;

మంచివారు + ఏము = మంచివారము. ఏము అముఅయినది.

ఈసమస్తక్రియలలో పూర్వపదమయిన మంచివాఁడనునది మంచి శబ్దమునకు వాఁడు ప్రత్యయముచేర్చుటచే వచ్చిన నామము.

వందుచున్నవాఁడు, వందుచున్నాఁడు } + ఈవు = { వందుచున్నవాఁడవు. వందుచున్నాఁడవు.

వందుచున్నవారు, వందుచున్నారు } + ఈరు = { వందుచున్నవారరు. వందుచున్నారరు.

వందుచున్నవాఁడు, వందుచున్నాఁడు } + ఏను = { వందుచున్నవాఁడను. వందుచున్నాఁడను.

వండుచున్నవారు } + ఏము = { వండుచున్నవారము.
వండుచున్నారు } + ఏము = { వండుచున్నారము.

శంభువవు = శంభువు + అవు.

విధాతవు = విధాత + అవు.

గోవవు = గోవు + అవు.

ఈసమస్త క్రియలలో పూర్వమునుండు వచ్చుచున్నవాఁడు, వచ్చుచున్నవారు, వచ్చుచున్నాఁడు, వచ్చుచున్నారు అనుపదములు ధాతుజన్య కర్త్రర్థకనామములు. (౧౬౬ విధి. చూ.)

**175.** అవుప్రత్యయము ఇకారాంత ఈకారాంత నామములకు పరముగ రాఁగా అకారలోపమును ఉకారమునకు వర్ణసమీకరణ న్యాయముచేత ఇత్వమును అగును.

ఉ. ముక్కంటి + అవు = ముక్కంటివి. జ్ఞాని + అవు = జ్ఞానివి.
కవి + అవు = కవివి. శ్రీ + అవు = శ్రీవి.

"నీవునరుండను పూర్వ'ఋషివి.'" భార.

**176.** దిప్రత్యయాంత స్త్రీలింగనామమునకు పరముగ అవుప్రత్యయము రాఁగా దిప్రత్యయముయొక్క ఇకారమునకు అన్ ఆదేశమగును.

మంచిది + అవు = మంచిదానవు.

చిన్నది + అవు = చిన్నదానవు.

మంచిది + అను = మంచిదానను.

చిన్నది + అను = చిన్నదానను.

ఈరూపములు భ్రాంతిచేతవచ్చినవి. మంచిదివి, మంచిదిని, చిన్నదివి, చిన్నదిని అని రావలసినది.

అఱవములో అదు అను నపుంసక సర్వనామైకవచనమునకు, విభక్తి ప్రత్యయములు పరములగునపుడు షష్ఠ్యర్థకమగు అన్ ప్రత్యయము వచ్చును. అది యే తెనుంగున అదుశబ్దమునకు సమానమయిన అదికిని వచ్చును.

| | | |
|---|---|---|
| అ. అదనై. | తె. | దానిని |
| అదనాల్ | ,, | దానన్ |
| అదఱ్కు | ,, | దానికి |
| అదనిలిరుందు | ,, | దాననుండి |
| అదనుడైయ | ,, | దానియొక్క |
| అదనుళ్ | ,, | దానిలో. |

పైఁజెప్పిన మంచిది, చిన్నదిశబ్దములందుండు అది ప్రత్యయమును నపుంసకమునందు వచ్చెడు అది ప్రత్యయమనియెంచికొని దికారమునందుండు ఇకారమునకు భ్రాంతిచేత అన్ ఆదేశమును జేసినారు

మంచిదాని, మంచిదానన్, మంచిదానికి, మంచిదాననుండి, మంచిదానియొక్క, మంచిదానిలో. ఇట్లు విభక్తి ప్రత్యయముపరమగునపుడు ది ప్రత్యయముయొక్క ఇకారమునకు తప్పుగావచ్చునట్టి అనాదేశము, అవు ప్రత్యయము పరమగునపుడుకూడ వచ్చుచున్నది. కాఁబట్టి మంచిదివి మంచిదిని అను రూపములకు బదులుగా మంచిదానవు, మంచిదానను అను రూపములు వచ్చును.

**177.** 'కలిగిన' అను అర్థముగల కల అను విశేషణమునకు అందు మొదలైన ప్రత్యయములు చేరఁగా కలందు మొదలగు రూపములువచ్చును.

ఉ. కల + అందు = కలందు.
కల + అరు = కలరు.
కల + అదు = కలదు.

కల + అవు = కలవు.

కల + అను = కలను.

కల + అము = కలము.

**178.** క్రిందవచ్చు పూర్ణక్రియలు వాక్యములందు అవ్యయములుగా వచ్చును.

కదా<br>కద<br>కదరా<br>కదవే.

కాదు అనుధాతువుయొక్క వ్యతిరేక నపుంసకైకవచనము. ఆకారము ప్రశ్నార్థకమయిన అవ్యయము. కాదు+ఆ=కాదా. ఆకారము హ్రస్వమగుటచే కాద, కదా, కద అని మారి వచ్చును. కద అనుదానికి రా, వే ప్రత్యయములు రాఁగా కదరా కదవే అనియువచ్చును. ప్రశ్నార్థకమయిన ఏకారము చేరఁగా కాదు+ఏ=కాదె, కదె అనియువచ్చును. కాదా, కదా మొదలయినవి ప్రశ్నమునందు వచ్చినను, నిశ్చయమే తాత్పర్యమగుటచే నదియె ప్రాయోగికార్థము.

"వర్ణకలితనా క్రమకోటిని వాఁడు 'కాదె' నేసె"

"ఏనేమిచెప్పఁజేసితినో నళినదళాక్షినీ నియోగంబునఁగా

'దే'వాఁడు జలధినుండుట మానియిటువచ్చినాఁడమగుపలుఁదానుణ."

"అక్కఱకురానిచుట్టము
మ్రొక్కినవరమీనివేల్పు మోహరమునఁ దా
నెక్కినఁ బాఱనిగుఱ్ఱము
గ్రక్కునవిడువంగ వలయుఁ గదరా సుమతీ."

అవురా<br>ఔరా<br>ఔఁగదా<br>అవుఁగదె

అగుధాతువుయొక్క భవిష్యదర్థక నపుంసకైకవచన పూర్ణక్రియ అగును. గకారమునకు వకారము రాఁగా అవును వచ్చును. ఇదియే ఔను అగును. వీనితో రా అను అవ్యయము చేరఁగా అవురా, ఔరా సిద్ధించును. పైఁజెప్పినకదా, కదె మొదలయి

నవి అప్పను పోనులతోఁ జేరఁగా అప్పుఁగదా పోఁగదె మొదలయినవి సిద్ధించును.

కాఁబోలు. అగును పైఁజెప్పినపూర్ణక్రియ. దానితో పోలు ధాతువుయొక్క భవిష్యదర్థక నపుంసకైకవచన పూర్ణక్రియయైన పోలును అనుపదిచేరఁగా అగును + పోలును అనివచ్చును. పోలును పదము నులోపముచేఁ బోలు అగును. అగును + పోలు = కాను + పోలు; సంధిచేత కాను + పోలు = కాఁబోలు అయ్యె. ఇది గ్రామ్యములందు కామోలు, కాముల అనివచ్చును. 'కానే మో' అనియర్థము.

**179.** కొన్ని భూతార్థక క్రియావిశేషణములు కాలమును సూచింపక క్రియావిశేషణములగును.

ఉ. మరలి=మరలు+ఇ. }
తిరిగి=తిరుగు+ఇ. } వ్యాపారముయొక్క ఆవృత్తిని దెలుపును.

ఒత్తిలి=ఒత్తిలు+ఇ. 'గట్టిగాఁ' 'దిట్టగాఁ'. అ. ఒత్తల్, ఫా. నా. 'బలముతో అదుముట'. అభావ నామమునుండి వచ్చిన. ఒత్తిలు అను క్రియకు 'బలము కలిగియుండుట' అనియర్థము.

వెండి. తె. వెన్ను, అ. పిన్ 'వెనుకటిభాగము'. అ. పిన్ అనుపదము నుండి పిందు అనుధాతువుపుట్టి 'వెనుకఁబోవుట' అని యర్థము నిచ్చును. అట్లే వెన్ను అను తెనుఁగుపదమునుండి వెందు అను ధాతువుపుట్టును. దానికిని 'వెనుకఁబోవుట' అనియే అర్థము. వెండి. వెందుధాతువువలనఁబుట్టిన భూతార్థక క్రియావిశేషణము. 'వెనుకఁబోయి' అనియర్థము, వ్యాపారముయొక్క ఆవృత్తిని దెలుపును.

వెంబడి. తె. వెంబడము, వెన్ను + పడు, వెన్ను, 'వెనుక' పడు 'అగుట'. ఇది అచ్చపదమయిన "పిన్నదు" అను దానికి సమమయి నది. వెండివలెనిదియును వ్యాపారముయొక్క ఆవృత్తిని దెలుపును.

అని. అనుధాతువువలనఁ బుట్టిన భూతార్థక క్రియావిశేషణము. ఇది 'ఈప్రకారమునన్' 'ఇట్లు' అను అర్థమును ఇచ్చును.

గుఱించి
గుఱిచి
కూర్చి

గుఱించి అనునది గుఱించుధాతువునుండి పుట్టిన భూతార్థక క్రియావిశేషణము. ఇది ద్వితీయావిభక్త్యర్థమునందుపవచ్చును. ఇదియెకూర్చి అని వచ్చును. దీనికి సరియైనది అచ్చమైన కుఱిత్తు. గుఱించి అనుస్వారలోపమున్నే గుఱిచి అగును.

ఉ. 'అబ్జాసనుఁడు తన్నునర్థితో 'గుఱిచి' యాచించుట గోరి సృజించె సురల." హరి. పు.

తొట్టి. తొట్టుధాతువువలనఁ బుట్టినభూతార్థక క్రియావిశేషణము! ద్వితీయావిభక్తితోఁజేరి 'మొదలుకొని' అనునర్థమునిచ్చును.

ఉ. "వనకేళీ కౌతుకమునఁ జనియును శక్తిఁ 'దొట్టి' సఖులెల్ల ముదంబునఁ గొలిచిరాఁగ." భార.

'వరములిచ్చువేడ్క వచ్చిరి వేయ్యారై యమరనాథు 'దొట్టి' యమరులెల్ల.' భార.

తొడంగి. తొడంగు ధాతువువలనఁ బుట్టిన భూతార్థక క్రియావిశేషణము, తొట్టివలెదీనికిని 'మొదలుకొని' యనియర్థము.

ఉ. "పాద్యమి 'తొడంగి' పదునాలుగు దివసంబులోఁ గ్రాకగింజ యకొఁదూమెఁడువడ్లు సమకూర్చె." భార.

పట్టి. పట్టుధాతువువలనఁబుట్టినది. ద్వితీయతోఁజేరి హేత్వర్థమునందు వచ్చును.

చేసి. చేయుంధాతువువలనఁబుట్టినది. ద్వితీయతోఁజేరి హేత్వర్థమునందు వచ్చును.

అయి / వి } అగుధాతువువలనఁ బుట్టినది. చతుర్థీవిభక్తితోఁజేరి ప్రయోజనార్థమునందు వచ్చును.

ఉండి. ఉండుధాతువువలనఁబుట్టినది. సప్తమీవిభక్తితోఁజేరి పంచమీవిభక్త్యర్థమునందు వచ్చును.

ఉ. అచ్చోటనుండి, అక్కడనుండి, గ్రామ్యమునందు ఉండి. ఉంచియగును. అచ్చోటనుంచి, అక్కడనుంచి.



చంద్రికా ప్రెస్, చాకలపేట, మదరాసు.—5-4-48

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మదరాసు.

ఆర్డరుతో కూడ సగమునొమ్ము అడ్వాన్సు పంపవలెను.

(తపాలుచార్జి ప్రత్యేకము.)

## సంస్కృత గ్రంథములు.

మేఘసందేశము. మల్లినాథ వ్యాఖ్య - తెనుఁగున ప్రతిపద టీకా తాత్పర్యపదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు. సంస్కృత మారంభించువారు ఈ తెనుఁగు సంపూర్ణటీక చేత దీనిని చదివి సులువుగా రసముగ్రహించి సాహిత్యము పొందవచ్చును. రు. 2 8

రఘువంశము మల్లినాథవ్యాఖ్య - తెనుఁగు ప్రతిపద టీకా తాత్పర్యములు. ఎల్లవారును స్వయముగా పఠించి సంస్కృతమందు సాహిత్యమలవరుచుకొనుటకు ఉత్తమసాధనము. మొదటి 6 సర్గలు 3 0

కుమారసంభవము, 6 సర్గలు. పైదానివలెనే టీక. 3 0

నైషధము. ,, ,, అచ్చగుచున్నది.

అమరుకావ్యము. శృంగారలక్ష్యము. వేమభూపాల సంస్కృత వ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీకయుఁ. అచ్చగుచున్నది. 1 8

పుష్పబాణవిలాసము. సంస్కృతవ్యాఖ్య. తెనుఁగు పూర్ణటీక. 0 8

హితోపదేశము, మూలము 1 0

,, తెనుఁగు తర్జుమా, టీకలతో 1 12

పంచతంత్రము, మూలము 1 8

దశకుమారచరిత్రము ,, 1 0

,, తెనుగు సటీకాతాత్పర్యము (అచ్చగు) 2 8

విక్రమార్కచరిత్రము, వచనము, టీకతో (అచ్చగుచున్నది)

భోజచరిత్రము, సులువైనశైలి, పైదానివలెనేటీక. ,,

వ్రతకల్పవల్లి (6 వ్రతములు) 1 12

అభిజ్ఞానశాకుంతలము, తెనుఁగువ్యాఖ్యతో అచ్చగుచున్నది.

బిల్హణచరిత్రము, తెనుగు పూర్ణటీక. (అచ్చగుచున్నది)
రసమంజరి, శృంగార రస స్వరూపవిస్తరము, సటీక. 1 8
ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి సంస్కృతటిప్పణము
గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సంయుతము. 1 8
శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిఙంతమంజరులు. 0 8

## ఆంధ్రగ్రంథములు.

### పద్యకావ్యములు.

ఆముక్తమాల్యద సంజీవనీవ్యాఖ్య. 12 .. 0
శృంగారనైషధము సర్వంకషావ్యాఖ్య. (అచ్చగుచున్నది)
విజయవిలాసము, చేమకూర వేంకటరాజు. టీకాసహితము ,,
సారంగధరచరిత్రము ,, ,, ,,
జ్ఞానవాసిష్ఠరామాయణము, వేదాంతము, మడికిసింగనకృతి 1 8
ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము 0 8
పారిజాతాపహరణము, మూలము 0 8
,, సటీక (అచ్చగుచున్నది)
సారంగధరచరిత్ర, ద్విపద (కవి విశ్వకర్మమతస్థుండు) 0 8
హరిశ్చంద్ర, ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము 1 0
మనుచరిత్రము, సటీక (అచ్చగుచున్నది)
నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, సటీక (అచ్చగుచున్నది)

### నాటకములు.

ప్రతాపరుద్రీయనాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 2 0
బొబ్బిలియుద్ధనాటకము 1 4
ఉషానాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 1 4
శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుగు 1 0
విక్రమోర్వశీయనాటకము, Inter Text నోట్సుతో 2 0
మాళవికాగ్నిమిత్రనాటకము 0 12
నాగానంద నాటకము 1 0

| | | |
|---|---|---|
| రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారివ్యాఖ్యతో | 1 | 4 |
| ప్రియదర్శికానాటిక | 0 | 8 |
| ఉత్తరరామచరిత్ర నాటకము—విపులమగు పీఠికతో | 1 | 8 |
| కృష్ణరాయవిజయనాటకము | 0 | 8 |

## సులభ వచనగ్రంథములు.

| | | |
|---|---|---|
| హితోపదేశకథలు, నీతిబోధకములు, (అచ్చగుచున్నది) | 0 | 8 |
| భోజ కాళిదాసకథలు, రసభరితములు వెలువడనున్నవి. | 0 | 12 |
| బేతాళ పంచవింశతిక | 0 | 12 |
| బేతాళుని యద్భుతకథలు, ప్రజ్ఞకలిగించునవి (అచ్చులో) | 0 | 10 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణము కలిగించునవి | 0 | 12 |
| కథాసరిత్సాగరము, అద్భుతనీతి వ్యవహారకథలు, ఆఱుభాగములు | 12 | 0 |
| ఒక్కొకభాగము ప్రత్యేకముగా | 2 | 0 |
| దశకుమారచరిత్ర, కథలు | 1 | 0 |

## లక్షణగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము, విశ్వనాథకవిరాజకృత సంస్కృతగ్రంథమునకు సరియైన యాంధ్రానువాదము. మూలమునందలి ఉదాహరణశ్లోకములతో చేర్చి ముద్రించితిమి. ఇందు నాటకలక్షణము సంపూర్ణముగా కలదు. | 5 | 0 |
| కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసములును పూర్తిగా | 1 | 4 |
| అలంకారసంగ్రహము | 0 | 12 |
| ఛందస్సు, విద్యార్థుల కుపయోగము, సంగ్రహము | 0 | 4 |
| కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య | 2 | 8 |
| అర్థానుస్వారతత్త్వము | (అచ్చగుచున్నది) | |

## శారదాకాంచికలు - విమర్శలు - ఉపన్యాసములు.

జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము 1 కింకిణి (అచ్చగుచున్నది)
ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ 2 కింకిణి ,,

కాళహస్తీమాహాత్మ్య ముద్రణవిమర్శనము 3 కింకిణి(అచ్చగుచున్నది)

గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, (పాత్రోచిత భాషనుగుఱించినది) 4 కింకిణి 0 12

మోచాకుసుమామోదవిచారము 5 కింకిణి ,,

ఆంధ్రవ్యాకరణ సర్వస్వవిమర్శనము 6 కింకిణి ,,

విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యనాటకాది విషయకము 0 12

తిక్కన సోమయాజివిజయము 0 12

విసంధివివేకము 0 2

భారతాభారతదూషకమర్యాదలు, (నాట్యకళాచరిత్రము) 0 6

ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము, తెనుఁగుపుస్తకముల నెట్లు విమర్శింపవలయుననుటను గూర్చినది. 0 6

గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్యగ్రాంథికవాదమును గుఱించినది. ఈవ్యాసములో శాస్త్రులవారు ఆంధ్రదేశమందలి అన్నిజిల్లాల గ్రామ్యములను వర్ణించియున్నారు. కడుపుబ్బనవ్వించువిమర్శ 0 6

స్త్రీపునర్వివాహగ్రంథము 1 0

ఆంధ్ర హితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము 1 4

ఆంధ్రభాషాసర్వస్వార్థనియమకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము— 25 ప్రకరణములు. సులువైనశైలి. శాస్త్రులవారిహాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలికపండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు, సర్, కట్టమంచి రామలింగారెడ్డి గారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము 1 8

A HAND-BOOK OF CLASSICAL SAMSKRIT LITERATURE, By Sri U. Venkatakrishna Rao, M. A. for college students. Questions also given. Rs. 2 (